# శ్రీ పార్వతీ విజయము






*

గ్రంథకర్త -

విద్వాన్ దువ్వూరు బసివినాయుఁడు

(బోర్డుసంస్కృత పాఠశాల ప్రధానాంధ్రోపాధ్యాయులు,

శ్రీ సాయిబాబా మాహాత్మ్యాది గ్రంథకర్తలు.)

# శ్రీ పార్వతీ విజయము

This book presented to
Thikkana Library by the Author
1.2.68



✻

గ్రంథకర్త

విద్వాన్ దువ్వూరు బసివినాయుఁడు
బోర్డున్నత పాఠశాల ప్రధానాంధ్రోపాధ్యాయులు
శ్రీ సాయిబాబా మాహాత్మ్యాది గ్రంథకర్తలు.)

Copy of the Proceedings of the Director of Public Instruction, Andhra Pradesh, Hyderabad R, C.No. 766-M. 4/59dated 12-12-'59.

The following book is commended for use in all the Libraries of Schools and Public Libraries in the State.

Name: **PARVATHI VIJAYAMU.**

Name of the author: **Sri D. Basavi Naidu.**

Copies can be had from:

SRI D. BASAVI NAIDU
Vidwan, Retired Telugu Pandit,
DUVVUR
Duvvur P. O. Nellore Dist.

**(Sd) S. K. Raghava Reddy**
for director of Public Instruction.

# ఉపోద్ఘాతము

సింహపురికిఁ బదునైదుమైళ్ల దూరంబునంగల దువ్వూరు దుర్వాసపురమనియు, నందలి శ్రీ కోటీశ్వరలింగంబు దుర్వాస ఈశ్వరుఁడనియు నామాంతరంబులఁ బూర్వయుగాదిఁ బ్రాచీనులచే వక్కాణింపఁబడుచుండె. ఇటుల నాపురియుసందలీశ్వరుఁడును నామాంతరంబుల నొందుటను గుఱించి. దుర్వాసనామశబ్దసంబంధంబెట్లు కలిగెనని బాలకాలముగ విచారించితిని. పరంపరజనాగతగాథసనుసరించి, సుమారిరువది సంవత్సరముల క్రిందట, నాకుఁదెలిసినంతవఱకు గద్యరూపమున వ్రాసితిని. కాని యయ్యది ప్రమాణములులేనిదై ప్రజాదరణ మొందదని యాకార్యమంతటితో విరమించితిని. అయిన నా ప్రయత్నము నశింపలేదు. ఆపల బ్రహ్మాండపురాణాంతర్గతమగు దీక్షమాహాత్మ్యంబున, నిమివశిష్ఠాదులు తీర్థసేవాసక్తులయిచనుదెంచి, దుర్వాస ఈశ్వరుని దర్శించిరనిగలదు. తదనుగుణ్యంబుగ నా పురియు దుర్వాసపురమని పేర్కొనఁబడియుండెను. పినాకినీమహాత్మ్యము కంపహాటి శ్రీ లక్ష్మీనరసింహసోమయాజిగారాంధ్రంబున ద్విపదకావ్యంబుగ రచియించియుండెను. అందుః—

" పినాకినీ మహాత్మ్యము పురాళ. అటఁ దర్శి దూ
ర్వాసు నాశ్రయాధీశు, కుటిలపన్నగభూషు కు
జనాళిదోషు, గంభీరభాషు యాగమశిఖా
భూషు, సంభక్తిరోషభూషు నఘసంఘశోషుఁడై
న దుర్వాసేశునందదంపఁగొల్చి "

యని యుండెను. దుర్వాసునిచే లింగంబు ప్రతిష్ఠింపంబడుటచేతనే " దుర్వాసునాశ్రయాధీశు దుర్వాసేశు " ననియిందుంబేర్కొనంబడినది. ఈవాక్యంబులు మదీయసంశయ నివారణకంబులై యీ కావ్యరచనకు

నధికారము (authority) నెసంగుటయేగాక, దుర్వాసపురమని, దుర్వాస ఈశ్వరుఁడని పూర్వులచే వచింపఁబడుచుండెననుట యదార్థమైనది.

2. పరంపరాగతముగ నీపురవాసులిప్పటికినీశ్వరుని దుర్వాస ఈశ్వరుఁడనికూడఁ బిలుచుచునే యున్నారు. సామాన్యముగఁ గోటీశ్వరుఁడని పిలుచుటకుఁ బార్వతీకన్యదేవినిఁ బ్రార్థించి వరంబులందినపుడు కోటి సూర్యప్రభాభాసుఁడగుటచేఁ గోటిలింగంబులచే వెలయుటచేఁ గోటిభక్తులచేఁ గొల్వఁబడుటచేఁ గోటీశ్వరుఁడని నామాంతరమిడుటచేఁ దదాది కోటీశ్వర నామము ప్రధానమై ప్రశస్తమునకు రాఁగలిగియుండును. దుర్వాసమహర్షి పినాకినీ తటమునఁ బ్రతిదినంబును దాదాపు మూఁడామడల దూరంబుఁ బ్రయాణంబుసేసి, యెచట మధ్యాహ్నసమయంబగునో యచట నదీసైకతంబుచే నీశ్వరలింగంబుఁ బ్రతిష్ఠించుచుండెననుటకుఁ దూర్పు కడలినుండి పశ్చిమ నాగరమునకుంబోవుచు (1) గోడూరు (2) దుర్వాసపురము (3) తూర్పుకంభంపాడు (4) సోమశిల ప్రదేశములలో దుర్వాస ఈశ్వర ప్రతిష్ఠలింగంబులుగానవచ్చుట నిదర్శనము. పినాకినిపొంత మహర్షి పసునించె ననుటయు, లింగంబు సైకతంబుచే నిర్మించెననుటయు యదార్థంబనుటకుఁ బినాకినీస్రవంతి యిప్పటి యాలయ దక్షిణపార్శ్వమునఁ బ్రవహించియుండెనని " ఏటికి నుత్తరపుతట్టుననుండు నీశ్వరునికి విక్రమసింహపురాధీశుఁడు శ్రీ గండ గోపాలదేవుఁడు దానంబిచ్చినట్లు " దానశాసనములో లిఖింపఁబడియుండుటయే యాధారము - కాలక్రమమున నదీప్రవాహము లిటకు రెండుమైళ్లు దక్షిణపార్శ్వమునకు మఱలిపోయి యీ భాగము మిట్టయేయుండును. దానశాసనమునందు:-

(1)

(2) మహారాజ గండగోపాలః, విక్రమసింహపురేంద్రః విక్రమ-విక్రమేనను

(3) మైచిత్రమే పుష్కలవివక్షి కర్మైవసంసకమలమ్
(తరువాతి ద్రావిడమున కాంధ్రానువాదము)

(4) పెన్నానదికి నుత్తరములో

(5) పయిన విజయసంవత్సరత్

(6) నమామిపపకంజలాని

సూర్యచంద్రాదులుండువఱకు

పై శాసన విస్పష్టభాగములంబట్టిచూడఁగ నీశాసనమిప్పటికిఁ దాదాపు 665 సంవత్సరముల కాలమున రచింపబడినది గాన నా కాలమునకుఁ బెన్నానది దేవాలయమున కానుకొని దక్షిణమునఁ బ్రవహించియున్నది. ఈ శాసన ముద్రావిడాక్షరలిఖితమౌటచే శ్రీ. సి. ఆర్. కృష్ణమాచారిగారు B. A., ఎపి గ్రఫిస్టు, ఇండియా, గారు దేవాలయమునకు 1943 సం॥లో విజయము చేసి, శాసనమును బరీక్షించి తెలిపియుండిరి.

ఇంతవఱకు గ్రంథావలోకన శాసనవిషయ గ్రహణాదిప్రత్యక్షాధార ములు లభించుటచే నిస్సందేహముగ నిర్వివాదముగ దేవుని ప్రతిష్ఠాద్యంత ములకథ సంపూర్ణముగఁ బద్యరూపమునఁ గావ్యఫేరణిలో వ్రాయఁగలిగితిని.

3. ఈశ్వరలింగావిష్కరణమునకు (1) గొల్లజేఁడు రామునికథ (2) ఎఱుకలవిడారు వారికథ ప్రాముఖ్యము వహించినవి. (3) గ్రామశక్తి ప్రభావం బెఱుగుఁట నెఱుకలవారి మౌఢ్యభావము హేతువై ధ్రువపఱచినది (4) ఈశ్వరమహత్తర తేజోవిలాసములు రాముని దృఢభక్తిచే వెల్లడికాఁబడి నవి. (5) దేవాలయ మంటప గోపుర, ప్రాకారాదులను జక్రవర్తుల హృదయాచంచలభక్తి విశ్వాసములు గావింపఁజేసినవి. (6) దేవి మహా త్మ్యము పార్వతీకన్యచే స్థిరీకరింపఁబడినది. ఈ విధముగ భగవంతుని మహిమాతిశయము, పూర్వకాలమున వెల్లివిరిసినది. ఈ చరిత్రాంశము లన్నియు నధికార పూరితములు (Full of authorities) కాకున్నను గవి కల్పనాంశములుకావు. ప్రకృతదృశ్యచిహ్నమయ జనపరంపర క్రమాగత విషయ ప్రామాణికార్థములైనవియే.

4. కావున నీ కావ్యాంశములు పండిత పామరుల కావంతయు సందే హాస్పదమియ్యఁజాలక భక్తిపారవశ్యమును గలిగించునని నా నమ్మకము. శ్రీ. సి. ఆర్. కృష్ణమాచార్యులు. B. A., గారి దేవాలయమును విజయము

చేసి నప్పుడందలి శివలింగము దర్శించినపుడు లింగము చాల ప్రాచీన మనియు స్వాభావసిద్ధ కళాపరిపూర్ణతనొందియున్నదనియు శ్లాఘించిరి. పార్వతీదేవి దర్శనమున నామెయొక్క చైతన్యసంకాశసర్వాంగ సౌందర్య మును వర్ణించి ముగ్ధులైరి. గోపురప్రాకారాదులంజూచి యుగ యుగాంతర నిర్మితములనిరి. యువసనాయక నివాసమునకుం బ్రకృతము కోటమిట్ట యనుట సార్థకమయినదనిరి. అచటి పురాతన శిథిలీకృతకుడ్యములయొక్క యిటుకజాలను, గుండ పెంకులను, ఫిరంగులకుపయోగించు రాతిగుండ్లను జూచి యప్పటికాలపు పనితనమునకు మెచ్చికొనిరి.

౫. సనాతన పురాతనసృష్టి ప్రతిష్ఠలనందిన యీ జగదీశుని (దుర్వాస ఈశ్వరుని) చారిత్రాత్మక మాహాత్మ్యము యుగ యుగాంతరములుగ రచింపం బూనిన పండితకవి శ్రేష్ఠులాయా ప్రాంతమున నింతకుంబూర్వమేరుగ ఋౖ యుండుటచే నీ కావ్యమితః పూర్వము వెలయకయుండుటకాదు; గ్రంథావ లోకన, శాసన విషయ గ్రహణ సమర్థత వారియందులేకుండుటకాదు. ఏ కార్యమునకుంగాని పరిణామదశాదనరము ముఖ్యముకాదా!

భక్తులకు శ్రవణానందదాయకమై యోగులకు మార్గదర్శకమై, ముముక్షువులకు మోక్షసామ్రాజ్యమై సాగరంబున రత్నంబులు, నదీగర్భం బునం గనకపంకంబు, గండశిలలమాణిక్యంబులణంగినట్లు దీర్ఘకాలంబుగ రహస్యాచ్ఛాదితంబైన యీకథ రచించుటకు భగవానుండెవరికిం సంకల్పావ కాశములు కల్పింపక, నా పూర్వపుణ్యభాగ్యంబున నా కొనగూర్చెనని నా దృఢవిశ్వాసము. కావుననే శ్రీ వెంకటేశ్వరుండు స్వప్నంబున నీ యుద్యమము కొనసాగింపుమని జాగృతినందికొని నన్నుద్ధరించెను. సర్వజ్ఞుండగు బరమే శ్వరుననంత విష్వలీలావిశేషంబులవర్ణించి తీర్చిదిద్దుటకునాబోంటి యజ్ఞుండు సమర్థుండగునా? ఈ కథారచన సుధాగ్నవాతరణమునకు నాదిదేవుండే నాకుం జోడైనాడని, యీ రచనయే దేవదేవునకానందదాయకమని నాయొక్క నమ్మకమైనపుడు నాకికే సందేహములంకురించును.

౬. పండితకవి వరేణ్యులింపలి దోనంబులనాయందనుగ్రహమున నందించి ద్వితీయ ముద్రణకాలంబునం బరిష్కరించుకొనగల నవకాశ మొసంగుదురని హృదయ పూర్వకముగ విజ్ఞప్తి చేయుచున్నాను.

శ్రీ సి. ఆర్. కృష్ణమాచారిగారు నా విన్నపమాలకించి, దేవాలయ శాసనాదులఁ బరీక్షించి, యందలి విషయంబులఁ జెప్పినందులకు వారికెంతయో కృతజ్ఞుఁడను.

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు శ్రీ వారినిచటికి రప్పించుటలో సాయపడినందుకు పిదప శ్రీ మేనకూరు బలరామిరెడ్డిగారు మొదలగు ప్రభృతులీ కథారచనమున కెంతయో యాహ్లాదముగనఁబఱచినందులకు వారల కెంతయో కృతజ్ఞుఁడను.

ఈ గ్రంథముద్రణభారము వహించిన దువ్వూరు, మక్తాపురము, అన్నారెడ్డిపాళెము, తదితర గ్రామస్థులు నా యీసంకల్పము నెఱవేర్చినందులకు వారికెంతయో కృతజ్ఞుఁడను.

ముద్రణకార్యము శ్రద్ధతో నిర్వహించిన శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డిగారికి నేనెంతయో కృతజ్ఞుఁడను.

ఇట్లు,

దువ్వూరు.

విద్వాన్ దువ్వూరు బసివినాయుడు.

9–2–59



# శ్రీ పార్వతీ విజయము

## ప్రథమాశ్వాసము

### మంగళము

శ్రీలీలావతి దానవోమణి సభా సింహాసనత్కౌస్తుభా
వేలా భాప్రతిబింబదర్శనమున న్వైరోకృతిం దాల్చె, నీ
కేళిం జక్కియటంచుఁ దాఁదలఁపఁగా వేవేమణిన్దాఁచి, యా
బాలారత్నముఁ గౌఁగలించు హరి యిప్పట్లన్ననున్గాచుతన్ 1

శ్రీవత్సాంకుఁడు శేషశాయియగుచున్ జెన్నొందఁగానంతలో
సేవాసక్తిని లక్ష్మి, తచ్చరణముల్ శీఘ్రింబుగాఁబట్టఁగా
రావే! నాముదితంపుముద్దయని, యారాజీవపత్రేక్షణున్
మోహిన్గ్రోలెడు దేవుఁడిచ్చుత మహామోదంబు నాకిమ్యోడన్ 2

సరసిజమందు నిల్చుటను సారసపత్త్రిమువోలెఁ బాదముల్
కరములఁ బద్మషండములు గల్గుట నట్టులనయ్యె హస్తముల్
నిరతము పంకజేక్షణత నీరజనేత్రవుగావె! నేనినున్
గరము నుతించుచుంటి, నను గాంక్షితసిద్ధునొనర్పుమీరమా!

## వంశదేవతా ప్రార్థనము

కొండలలోనఁ ద్రిమ్మరుట, గోతులగుంపును గారవించుటన్
దండిగఁ బేదసాదలను దాపునఁ జేర్చుటఁ, గెల్చువారలన్
రండనిపిల్చి కాచుటను, రామునిపోల్కిని నీవుదోఁచె, నీ
యండను గోరితద్ధర, దయాకర! శ్రీకర! వెంకటేశ్వరా! 4

తొలుతను మత్స్య,కూర్మములు దొడ్డవరాహము, నంతనెంతయో
బలయుతుఁడౌ నృసింహుఁడును, వామన, భార్గవ రామ
రాములన్
బొలుపుగ రామకృష్ణులును, బుద్ధుఁడవున్ దగ నైతివీవ యీ
యిలనిఁక గల్కిరూప మెటులెత్తఁగనుంటివో? దేవ! వేడెదన్

## గ్రంథనాయకుండగు శ్రీ పార్వతీశ్వరు ప్రార్థనము

సర్వాంభోనిధులన్ మునుంగుటకునై సన్మౌని దుర్వాసు డం
తర్వాణిశుఁ, డిలన్ బినాకిని దరిన్ దాఁబోవు చామార్గమం
దుర్విన్ సైకతలింగ మేర్పఱచి, మెప్పొందంగఁ బూజాదులన్
నిర్వర్తింపఁగఁ బ్రోవవే! హర! యటుల్ నిత్యంబు నన్ గావుమీ.

కమలాదేవిని జేర్చి మాధవుఁడు వక్షస్థానమందున్ దయన్,
గమలాసనుఁడు భారతిం గొనియె వాక్స్థానంబులో, నీవనన్
సమవాయంబున నీబతిన్ గలసి, యిచ్చార్ధశక్తి గ్రీడింపవే?
కమనీయోజ్జ్వలశక్తి! విశ్వజననీ! గౌరీ! నినుంగొల్చెదన్ 7

---

6 = అంతర్వాణికుఁడు = శాస్త్రము నెఱిఁగినవాఁడు

## శ్రీ సూర్యదేవతా ప్రార్థనము

ఆదిత్య ! సవిత ! భాస్కర !
మేదినిఁ బోషించుసామి! మించినభక్తిన్
మోదముతోనినుఁగొలిచెద;
సాదరమతినన్నుఁ బ్రోవుసతతము దేవా! 12

అరుణోదయమున బ్రహ్మగ,
హరుఁడుగ మధ్యాహ్నమందు, హరిగా సంధ్యన్,
బరగెదవీవు త్రిమూర్తిగఁ
గరమరుదుగసూర్యదేవ ! కావుము గొల్తున్ 13

## సుకవిస్తుతి

## శ్రీ మదాదికవి వాల్మీకిమహర్షి ప్రార్థనము

క్రౌంచమిథునంబునందు నొక్కటిని బోయఁ
డెంచకయె, పడవ్రేయఁగ నెవఁడుపలికి
నది యనుష్టుప్ శ్లోకమై యమరుచుండె,
నట్టి వాల్మీకి గొలుతు నే ననవరతము. 14

కవితాశాఖనుజేరి, రామకథలన్ గానంబులో మేళవం
బవునట్టుల్ దగఁబాడుచున్, జనులకత్యానందసంమోహసం
భవముల్ గొల్పి ప్రశాంత మానసుల నొప్పారంగ గావించి కాం
బవకీర్తింగనినట్టి, యోగిఁగొలుతున్ వాల్మీకియన్నాకలన్ 15

15 కాంబవకీర్తి = శంఖమువంటి తెల్లని యశస్సు

## శ్రీ వ్యాసమహర్షి ప్రార్థనము

కలుషమోఘ రోషద్వేష విసర్జితదేహుని, దండధారు, నా
బాలశశాంకమౌళి పదపంకజభృంగు, మృగాజినాంబరున్
శీలసమన్వితున్, నిగమసిద్ధసమస్తపదార్థతత్త్వవా
గ్జాలుని, భారతవ్యాసయ రసాలతరూర్జితు వ్యాసు దల్చెదన్ 16

## శ్రీ మహాకవి కాళిదాసాది గీర్వాణకవుల ప్రార్థనము

కాళిదాస, మయూర, శంకర, వరరుచి,
దండి, భవభూతి, బాణాద్యఖండకవుల
మదినిదలంచి నేఁ బెక్కుసమనస్కృతులొన
రించెద, వాక్సిద్ధి నాకొనరించుకొఱకు

## శ్రీ నన్నయభట్టాద్యాంధ్ర కవుల స్తుతి

నన్నయభట్టు, దిక్కనను, నాచనసోముని, నన్నెచోడునిన్,
బన్నుగ నెఱ్ఱనార్యు, వరపాల్కురిసోమునిఁ, బోతనార్యుఁ బె
ద్దన్నను, భట్టుమూర్తి, బహుహాస్యవచస్కుని రామలింగు, సూ
రన్నను ,బెక్కురాంధ్రకవి రాజులఁ దల్చెద నామనంబునన్ 18

* సూచిమంచివంశాంబుధి కుముదబంధుఁ
దిమ్మనార్యు నభినుతింతు నెమ్మనమున

---

* ఇతఁడు పిఠాపురము జమీందారిలోని కందరాడకుఁ గరణము. ఇతఁడు రుక్మిణీపరిణయము, సింహాచలమాహాత్మ్యము, నీలాసుందరీపరిణయము, రాజశేఖరవిలాసము, అచ్చతెనుఁగు రామాయణము, సారంగచరిత్ర, సాగరసంగమాహాత్మ్యము, రసికజనమనోభిరామము, లక్షణసారసంగ్రహము మొదలగు గ్రంథములు రచించి, రావుమాధవభూపతిచేఁ గవిసార్వభౌమ బిరుదమందెను.

నాదు జీవిత పరివర్తనంబునకును
మార్గదర్శకుఁడౌటను మంజులముగ

## గురు స్తుతి

సకలశాస్త్రపారీణుఁడు, సద్గుణుండు,
కరుణనిడ్డమద్గురుఁడగు కాళిదాస
వంశజాతు, వెంకటసుబ్బ పండితార్యు
దివ్యపదములఁ బూజింతుఁ దిరముగాను

సంస్కృతాంధ్రాంగ్లములునేర్చి, శక్తిగనిన
ఘనుఁడు దుర్భసుబ్రహ్మణ్యకవివరుండు
అరసి పద్యంబులిందుల నభిలషించె
వారికే నొనర్చెదను వందనములు

## గ్రంథకర్తృ వంశావళి

ఆదివెలమ వంశమందుఁ, గొండంగళ్ల
గోత్రజాతుండయి కొమరుగనిన,
యోవనారాయణులు, డాతని సహచరి,
సునిశితవ్రతయగు సుబ్బమాంబ,
వారికి నేవురు వరుసజన్మించిరి,
యందుఁ బుత్త్రులు ముగ్వురధికయశులు;
అగ్రజుఁ, డందులో నతులితగుణుఁ డౌచు
సుబ్బయాఖ్యుండు నా సొంపుదనరె;

సతికి సతియగుచు నెనుజాంబ నరిగె:
నాకిప్పుడు త్రొక్కనారి బసవ, శంక,
రామినాథాయుడు లనఁగ సతులగిరిపు,
సమనుగ్రహించ జాలి నేనరసిచూడ.

నాదు పినతండ్రులందొగి, నయగుణుండు
రామయాఖ్యుఁ డాంగ్లాంధ్ర భాషామనీషి,
గణితశాస్త్రంబు రచియించి గణుతికెక్క,
రసముచిలుకంగ వ్రాసెను రామకథను. 23

నాసహోదరులిరువురు నయముమెఱయ
నాంగ్ల భాషను జక్కగా నభ్యసించి,
నడసిరిటఁ బ్రభుత్వోద్యోగ, పదవులఁ జిఱు
తంను పేరిలోఁ బట్టభద్రతను బొందె. 24

బాల్యమునందె తండ్రి నను బాసిచనంగ గనునాంగ్లవిద్య సా
కల్యముగాఁగడొప నవకాశమునొందమి, నాంధ్రమందు సా
ఫల్యమునొందఁ గావ్యములఁ భక్తి పఠించుచునుండ, నా యవాం
చల్యమనంబునం బొదవె జక్కఁగనాంగ్లముగూడఁ బొందఁగన్,

కరణవృత్తి నే బడసి కాలము పుచ్చితి, నంతఁ దెల్గుబా
సరచన మింపుగొల్పఁగను జల్పుచు నాంధ్రమునందుఁ బొండితీ

గరిమ గడించి, యోగ్యమునఁ గాంచితి నున్నతవిద్యఁబొగ్గిగన్,
జటిపితిఁ బాఠశాలలను జయ్యనబోధకవృత్తి నంతటన్ 26

ఈచారిత్రము నేరచించుటకుగా నీశుండునాకిట్టులన్
ధీచాతుర్యమొసంగెనంచుమదిలోఁ దీంద్రించపనేఁబూని, యా
యాచోట్లంగల శాసనాదుల విశేషాసక్తితోఁగాంచి, నేఁ
దూచాతప్పక వ్రాయఁబూనితిగ, నెంతోభక్తిదీపింపగన్ 27

ఈచరితంబు నంకితము నేరికిఁ జేసెదనంచు నే మహా
యోచననుండ, శ్రీహరియె యొప్పుగసమ్మతిఁజూపి యట్టులే
ప్రోచి, రయంబునన్ గృతికిఁ బూనుము, కావ్యమువ్రాయు
మంచు, నా
కీచతురత్వముం గరుణనిచ్చి, తొలంగె సదృశ్యుఁడై కలన్. 28

## కృతిపతి నిర్ణయము

శ్రీ వెంకటేశ సనుమతి
నేవిపులముగా రచించు నీశ్వరుకథ నా
దేవునకు నంకితమ్మును
గావింపఁగ దలంచినాఁడ గమలాక్షు దయన్ 29

శేషాచలమున నెలకొని
పోషించుచు నెల్లజనులఁ బొల్పగుదయతో
భీషణ భాషణ తత్పర
దూషకులెడ దోషమణచు దోషహారునకున్ 30

# శ్రీ పార్వతీ విజయము

## ప్రథమాశ్వాసము

### కథాప్రారంభము

శ్రీశేషాచలపతి నే
నాశించితి నధికభక్తి ననిశముగొల్చున్
ధీశక్తి నొసఁగి ప్రోవుము
ఈశుని చరితంబు వ్రాయ నిందిరరమణా! 35

శ్రీ నైమిశారణ్యంబను శ్రీ విష్ణుక్షేత్రంబునందు శౌనకాది మహామునులు యాగంబుసేయుచు, నందొక్కనాఁడు నిత్యనైమిత్తిక హోమంబులాచరించి సత్కృతుండై సుఖాసీనుఁడై యున్న సూతుంజూచి పూర్వంబు శ్రీ దుర్వాసమహామౌనిశ్రేష్ఠుఁడు మోక్షార్థియై సప్తసాగర నిమజ్జనోత్సాహుఁడగుచు మహేశులింగంబుఁ ప్రతిష్ఠించి పూజించిన కథావిశేషంబెట్టిదియో వినవలతుమని ప్రార్థింప, వారలకుఁ బూర్వము శ్రీ మహావిష్ణువు ప్రీతుండై యిందిరాదేవికిం జెప్పంబడి, శ్రీ వేదవ్యాసమహర్షి ప్రణీతంబైన బ్రహ్మాండపురాణాంతర్గతం

బగు పినాకినీమాహాత్మ్యఖండమునందలి శ్రీమద్వ్యాస ఈశ్వర
మాహాత్మ్యము నావలి పార్వతీవిజయమును జెప్పందొడం
గెను. 36

సకలనిగమాగమజ్ఞుండు సచ్చరిత్రుఁ
డగు మునీంద్రుండు మద్వ్యాసుఁ డవనిలోన
నీశు నిల్పుటయును, పార్వతీశుమహిమ
నేను రచియింపఁబూనితి నియతితోడ 37

## పినాకినీ నదీ జననము

జంబుద్వీపమునందు వింధ్యగిరికిన్ సవ్యానుపక్త ప్రదే
శంబొప్పారెడు సర్వధాన్యముల సస్యశ్యామలంబై మహిన్
జంబీరామల కామ్రవృక్షతతులన్ సంపన్నమై యెప్పు డా
సంబాధంబున గ్రాలుచుండు ఘనమౌ జంబాలినీప్రాజ్యయై 38

*ఈనదీజన్మప్రకారం బెట్టిదనన 39

* పినాకినీనదీజననము బ్రహ్మాండపురాణంబునఁ, దీర్థమాహాత్మ్యఖండమునఁ బినాకినీమాహాత్మ్యమునఁ గలదు. ఆంధ్రీకరణకర్త - కందనూరి శ్రీ లక్ష్మీనృసింహ గోవిందసోమయాజి; ద్విపదకావ్యముగా రచియించెను.

పు. ౧౯. ఆ. ౧ వసిష్ఠుండు నిమిచక్రవర్తికిఁ బినాకినీ జన్మకథనంబుఁ దెల్పుట.

శివుఁడు పార్వతిభామినిఁ జేరి వేడ్క
సంచరించుచు నొక్కెడ మించి దనరు
నందిపర్వతశ్రేష్ఠు నానాఁడు గాంచి
యచటిపుష్కరమునఁ గ్రీడసందఁ గోరి
దుష్టసంసర్గమెద్దియుఁ దోపకుండ
ఘనపినాకము నడ్డంబు గాఁగఁ జుట్టి

---

"పాపంబులనిరియెడి బహుయరణ్యముల, నేపు మాపగనోపనిది యనలంబు జననమరణములన్న జలధికౌర్వ మనఁదగి శివుచాపమందు జనించి వర పినాకిని సమాహ్వాయమును బొంది,"

శివుని జటాపటలియందుఁ బినాకిని జన్మంబునొందుంట పుట ౨౨

"రమణీయ నందిపర్వతరాజు గాంచి వేడుక మీరంగ వెలఁదితోఁగూడి క్రీడసల్పఁగఁగోరి గిరివరాగ్రమున,"

"తులువలపసులను దుష్టసంసర్గములు గానరాకుండ ముందుఁబినాకము లపరించియు నడ్డమానట్టు జుట్టి యలమహోత్సాహాహాస్యత చేతనలరి నందిపుష్కరమున నయముదీపింప కందుకజలకేళి గావించుటకును తన జటాపటలముల్ దద్దయువిప్పి వనజాలములకును వలయముజేసి మునిఁగియుఁ దేలియు ముదమున తేచ్చి;"

"వీరును వారు వావిరిప్రగల్భముగ వారిపరంపరల్ వరుసఁజల్లుచును కసీతి నుత్సాహమింపొంద స్నానమారూఢిఁజేయ నాయంబువుల్ పొంగె కమలంబులన్నియు గాండంబులయ్యె విమలజలంబులు వికలంబులయ్యె నుప్పొంగి జలములు నోడ్డుకుడరెమి యొప్పుగా ధారలై యురవడి కాఁగ నందొక్కటి పినాకమందున ద్వారి కందువతోఁ జారగా నదియయ్యె పూని పినాకినీ పుణ్యతీర్థంబు."

యూథపంక్తు లచటిపద్మాకరమునఁ
జేరి, జలకేళిసలుపంగఁ జెలఁగిరంత. 41

వారు జలాశయంబున నవారితమోహ విలాస జాల వి
స్ఫారమునన్ మెలంగఁగ నపార తరంగ విజృంభడంభ కా
సార జలంబు మీఁదెగసి చయ్యనదూరె పినాకమందు నో
య్యారముతో స్రవంతివలె నయ్యెఁ బినాకినియంచు భూమిలోన్

సెలయేఱు లూఁగివచ్చి సెలవున్గై కోనురీతి
సాగిలి మ్రొక్కెడి సరసనుండ
పర్వతిసంఘముల్ పావనతనుబొంద
బటుతర మైత్రితోఁ బరిఢవిల్ల
వృక్షంబులెప్పుడు విధికృత్యములనల్పు
భటసమూహమువలె బాఱుదీర
సైకతపుంజముల్ సాన్నిధ్యమున నెపు
మృదుతల్పములగతి మెఱయుచుండ

సంతత లతావితాన వసంత కుసుమ
గంధబంధుర జనిత సుగంధమిళిత
మందమందానిలాశ్లిష్ట మందగమన
నిమ్నగా సుందరంబెంతో నీటుకొలిపె! 43

కర్ణాటాది మహీస్థలంబుల నిరాఘాటంబుగాఁ బొంచ్చి, త
త్కర్ణాటీశులఁ దృప్తిఁ జేయుచు లసద్దాక్షిణ్యసంప్రీతితో

జీర్ణంబైన తటాకపుంజముల నుజ్జీవంబు కల్పించుచున్
*తూర్ణంబై చనుదెంచె నాంధ్రజననీద్యోతంబు దీపింపగన్ 44

ఆస్రవంతిని పిదప ననంతపురము,
కడప, నెల్లూరు సీమలఁ గడిమిఁజొచ్చి
పాఱి చేరెనుసాగర ప్రాంత్యమునకు
నాంధ్రరాజ్యంబునుంగొంత నంద సిరిని 45

దారి, జయమంగలి కుముద్వతులఁ, జిత్ర
వతినిఁ, బాపఘ్ని, సగిలేరు, బాహుదలను
నుపనదీకాంత లొగిఁజేర నోర్మితోడ
వరుసలొఁగొని పొంగుచు బలిమినొంది. 46

అదిమొదలుకొని గడుఁగొప్పయలలతోడ
నల్లరేగడపొలములఁ దెల్లనైన
మెట్టనేలల వడిఁబాఱి మించి దనరి
తూర్పుకొండలసాలులో దూరివెడలె 47

పిదప నాపినాకిని గడుఁబ్రీతి దనర
గడపపురమునకును గొంతగడప టలరి
సిద్ధవటమును, చెన్నూరు చెంగటలను
దోసకాయల కొసఁగెను దోహదంబు 48

*తూర్ణంబై = వడిగలదై

తీరములఁ జాఁగనిసుకపుఁ దిన్నెలమర
వృక్షపంక్తులు ప్రక్కల వృద్ధిఁదనర
నిరుకెలంకుల నీటిచే నింపి యున్న
పైరుపంటల నభివృద్ధి పఱచెనచట 49

అటుల నటనుండి పాఱుచుఁ బటుతరమున
సరససోమేశ్వరేశ్వరు, సరగఁ గొలిచి,
కూర్మిఁ బ్రాగ్భాగమునను ండు కోటిశివునిఁ
గమల బిల్వాక్షతలచేతఁ గడిమిఁదనిపె 50

తదనంతరంబు. 51

సంగమ పర్వతంపుఁ దటి సాఁగిలి మ్రొక్కెడి నిమ్నగాద్వయం
బుం మక్కువం గొనియె; బూర్వులు సంగమమంచుఁ బిల్తు; రా
సంగమభూమిఁ బుణ్యజన సంఘము గూడుటచేత నీశ్వరుం
డంగనతోడఁ జేరుటయె నార్యులు పేరిడ సంగమేశుఁ గాఁ 52

సంగమేశ్వరు చెలిమినిఁ జాలనొంది
స్వామిసదనంబు గ్రుమ్మరి సప్రణామ
మాచరించుచు నభిషేక మాదొనర్చి,
సరగఁ బూజించి, యద్దేవు సమ్మతిఁ గొని 53

పూర్వదిశ నరగి, ఋషికులపూజ్యమైన
వనమునను బ్రవహించుచు నన్నెగూర్చి

పర్వతంబులచే నేత్రపర్వమగుచు
వేల్మిగుండంబులఁ భువి వెలిసినట్టి 54

మల్లికార్జుని దర్శించి, మహిమగన్న
వేదగిరియున్న నరసింహు వినుతిసేసి,
సింహపురమును గోరి వేంచేసియుండు
రంగనాథుని పదసేవ రక్తి నందె 55

సీ *ఎఱ్ఱసిద్ధికినేది నెలవయి పఱగుచు
నేలుగఁ మనెడ్డు నింపుగొలిపె
తిక్క తెలుఁగుచోడదేవున కేభూమి
పరిపాలనముఁ జాలవసదియయ్యె
మనుమసిద్ధికి నేది మనికిఁ బట్టణమయి
మంజుల తరముగ మదికినొప్పె
గండగోపాలేశు గారుణ్యమునకునై
మొదలిమానసు లింపుఁగనిరి
భారతాంధ్రీ కరణకర్త భవ్యగుణుఁడు
తిక్కనకునెద్ది నెలవయ్యె తిరముగాను
అట్టి విక్రమసింహపురాశ్రియంబు
నొంది వడినేఁగె (బూర్వదిశోన్ముఖముగ 56

* సింహపురి పాలనము'- ఎఱ్ఱసిద్ధి క్రీ. శ 1207. తిక్క తెలుఁగు చోడ భూపతి క్రీ శ. 1210. మనుమసిద్ధి 1245. గండగోపాల దేవుఁడు 1289 మొదలుకొని పాలించియుండిరి.

తే. సాగరముఁజేరెఁ బతిఁజేరు సరభసమున
మేలుమేలంచు దివిజులు మెచ్చిఁ బొగడ
భూమిజనములు గ్రుంకుచుఁ బూజలొసఁగ
నిత్యసౌభాగ్యవతి బినాకినీ స్రవంతి. 57

సీ. ప్రాకటమైన ఫేనసుమ పంకముతో బహురత్నరాజితో
సైకతశయ్యతోఁ గమఠసారతిమింగల మత్స్యసేనతో
భీకరవీచి నిస్వనన విస్మయభాషలతోడఁ బ్రీతినా
రాఁకను మెచ్చి పొంగి, యెదురై చనె సాగరుఁడావగన్
గనన్ గగనన్ 58

ఉ. మించినవేడ్క తోడఁ బతిమెప్పువడన్ వడిఁజేరెనంబుధిన్
గాంచెను సర్వజీవుల నకారణవైరములేక భక్తి సే
వించెను భర్తసాగరుని వేల్పులు మెచ్చఁగ నాతఁడంతటన్
బంచశరాసిభగ్నుఁడయి బాధలనొందక యొందె సౌఖ్యముల్ 59

## దుర్వాస మహాముని యాగమనము

సప్తర్షులను బహు సన్నుతికెక్కిన
యత్రియోగీశ్వరుం డవనిగలఁడు
ఆతని గొనఁగూడె ననసూయ యనుకన్య
పత్నిగాఁ బ్రియమున పరమసాధ్వి

వారికిఁబుత్త్రులు వారిరి లేనన్క,
ననపత్యదోషంబు నణప వారు
నేసిరి దపము సుస్థిరయోగమహిమచేఁ
నంతట వారిపై నమితకరుణ
నజుఁడు విష్ణు రుద్రు లవనికి నేతెంచి
దీర్ఘ తపముచేతఁ దేజరిలెడి
యత్రిదంపతులకు నాసలు దీరంగ
బుట్టిరంత వారు పుత్త్రులగుచు 60

*వారింబేర్కొనె నొక్కఁడై ఘనుఁడు
దుర్వాసుం డనంగా సదా
చారుం డాశ్రితవత్సలుండు తపసోత్సాహుండుధీరుండొగిన్
బారావారములన్మునుంగుటకునై ప్రారంభ యత్నంబుతో
ధీరత్వంబునఁ బూర్వదిక్కుదధి నుద్దీప్తిన్ వడిన్ జేరఁగా 61

గురుతరమైనగడ్డమున గోపసముజ్జ్వలనేత్రకాంతితో
సురుచిరమైన వక్షమున శోభనుగూర్చెడి మాళిజూటితో
కరములు జానువుల్ దగులఁగాయము దీర్ఘము కాఁగ, మౌనియా
పరమశివుండు భూతలిని బాదములుంచిన భాతి దోఁచెడిన్ 62

దుర్వాసుండటుఁ దోత్రఁదూర్పు కడలిన్ దుర్ధర్ష తన్ గ్రుంకి దా
సర్వాంభోనిధులన్ మునుం మహితోత్సాహంబుతోఁ దక్కులన్

---
*బ్రహ్మ=చంద్రుడు, విష్ణువు=దత్తాత్రేయుఁడు, ఈశ్వరుఁడు=దుర్వాసుఁడు.

నిర్వర్తింపఁ బినాకినీనదిదరిన్ నీరంబుచెంతన్ వెసన్
బూర్వం బేరును బోనఁ జాలని పథిన్ బోయెన్ బ్రతీచీ దిశన్ 63

† యోజన త్రయంబున నడచి, యొక్కచోట
నేటియొడ్డున నరనమా యిసుకయందు
శైవపూజనుభక్తితో సల్పుకొనుచు
యాత్రసాగించె నమ్మౌని యతిముదమున 64

అటుల శిష్యులతోఁగూడి దాఁ బోవుచుండ నొక్కయెడ
సింగపుఁగొదమలు చెలఁగుచు వేడ్కతో
నేనుఁగుగములపైఁ గెగయుచుండ
నేనుఁగులనుగని యిటునటుఁ బర్విడు
శార్దూలపంక్తులు జాడఁదప్ప
శార్దూలములయొక్క సడిఁబట్టి పారెడు
హరిణ సమూహముల్ గరము బెదర
హరిణసమూహంబు లటునిటుఁ జొరఁగను
ఘోరసర్పంబులు ఘోషసల్ప 65

వానిగని మయూరంబులు వసుధఁ దిరుగ
బిలముల విదూర నందఁ బిపీలికములు

† కోడూరు దూర్వాసపురము తూర్పు కంభంపాడు, సోమశిల మొదలగు స్థానములు.

పైకి నెగఁబ్రాఁకి వెలుగులు పట్టి నఁగ
గనఁగ భీకరమైయొప్పెఁ గాననంబు. 66

*ప్రాంచదుద్భూత తరోట్టపీచర మహాప్రక్రాంత గర్వోన్నతో
దంచద్విక్రమ ఘోరవన్యమృగ భీతారావ సంక్షోభదు
స్సంచారస్థలి వేగదాఁగడపి యుత్సాహంబునంగాంచె, రా
యంచల్ గ్రుమ్మరుచున్న దివ్యసరసోద్యానంబు నచ్చేరువన్ 67

సీ॥ వనకరిమదజల వర్ధితతరువులు
చదలుగప్పిన బహుశాఖలొప్పి
మధుమదోపకలిత మంజులకేరళీ
స్నిగ్ధగండములేర్చు చిగురులొప్పి
మలయపర్వత పరిమళమును నిరసించు
సుందరతరమైన సుమము లొప్పి
కేళికాకందుక లాలిత్యముహసించు
బహురసప్పూరిత ఫలములొప్పి

ఔర! నందనవనమొ! మందారవనమొ!
తెలియరానట్టి మఱియొండు దేవవనమొ!
చూడఁజూడంగఁ జూడ్కులఁ జూరఁగొనెడి
యొక్క రమ్యంపు వనమట నుండఁగాంచె 68

* ప్రాంచత్ + ఉద్భూత = ప్రకాశమానమును బొందఁబడిన
† సంచార = అతిక్రమింపఁబడిన

చూతంబుమీఁదికి జొచ్చిపోవుచునుండె
మాధవీలత గడు మంజులముగ
జాజిపైఁ కెగసి బల్ సనవు సూపుచునుండె
నవమాలికావ్రతతి నాజెసరిగ
వకుళవృక్షంబుతో వరుసదెల్పుచునుండె
హేమపుష్పికచాల దీమసముగ
కుముదికాతరుశాఖఁ గూడిపెన్గుచునుండె
కుందంపుఁదీవెయు గోర్కెసెలఁగ

వృక్షములవృద్ధి గొలఁకులపిరివి, యచటి
పద్మములరక్తి హంసలపంక్తిమైత్రి,
లతలసుభగము, పులిన తలముల సొబగు
సొంపుఁగొలుపుచునుండెఁ బున్నెంపు భూమి 69

శుకములువనములో శోధించి యెల్లెడ
మధురఫలంబుల మరగుచుండె
పికములుకామించి ప్రీతినిఁగొల్పించి
ప్రియసులను జేరఁబిలుచుచుండె
గోయిలలిగురులఁ గోర్కెలారఁగదిని
కొమ్మలపై జేరి కూయుచుండె

హరిణసమూహంబు లందందుఁ దిరుగుచు
మృదువైన తృణముల మేయుచుండె
వనమయూరములాడుచు వరుసనుండె
తేఁటు లతిప్రీతి దేనెను దెచ్చుచుండె
క్రోతి గుంపులు మధువును గ్రోలుచుండె

## దుర్వాస మహర్షి ఈశ్వరలింగంబు ప్రతిష్ఠించుట

అట్టివనమున కాబుషియరిగి యటకు
నామడలుమూఁడునడచిన యలసటచట
నాపగాముఖమున సైకతాగ్రమందు
బిల్వవృక్షంబులుండెడి పీఠుసేరి 71

పాండురమైన సైకతము భానుమరీచికలన్ గలంగియు
ద్దండశిఖన్ వెలింగి రజతాద్రియుఁ బోలగఁ, జేరువన్ సదా
గండశిలప్రవాహజనకంబగు నిమ్నగతోయజాలమా
యుండెనె గంగఁబోలఁ, దరులచ్చట బిల్వవనంబు పోలఁగన్ 72

దండ కమండలువుల నిడె
పెండియుఁబులిదోలుసంచి విధిగాఁబొంతన్
గొండొకతరుశాఖనునిచి
యుండెను శ్రమబాయ నీడ నొక్క నిముసమున్ 73

స్నానము సేసెనునదిలో
మేనెల్లనుబూదిపూసె మించినభక్తిన్
స్థాణువునుకొలిచి యాసనమున
నాసనస్థల దృష్టితిని గ్రిష్మన నుంచెన్ 74

యోగాభ్యాసముచేతన్
రాగద్వేషంబులణచి రాజిలుబుధులన్
రాగరహితుండీశుండుగని
వేగముగాఁజేర్చుఁ దనదువీటికి బ్రీతిన్ 75

దేవదేవుని మనమున దివిరినిల్పి
యచలబుద్ధిని జింతించె నమితభక్తి
నాగభూషణుఁ డాతని నడవడికిని
జాలమెచ్చెను సంతసస్వాంతుఁ డగుచు 76

అంతఁ గైలాసంబున మహేశుండు పార్వతిఁజూచి

చెలిరో! యాత్రిజమౌనిపుంగవుఁడునిశ్చింతన్ నన్నున్ వేడెడిన్
నళినాక్షీ! యిపుడాతనిన్ గననిచో నాయందలీర్ష్యంబుచే
బలిమెట్టున్ భువనంబులెల్లఁ ద్రుటిలో భగ్నంబుగావించెదున్
చలమున్ బూనినమౌన్నిఁగానళమొయుజ్జాతాదులంగూడినన్ 77

పోయివచ్చెద నన్మౌనిపుంగవుఁగనఁ
గాలహరణంబుగూడదు కంజనేత్రి!

యంతకాలంబు నీవిట నధివసింపు
ప్రమథగణములు నిన్నెప్డు భక్తిఁగొలువ 79

దేవా! పోవుట వచ్చుటల్ గనఁగ నీదివ్యోపపాదత్వమా
భావంచే? మఱియేమి? నిన్నొడచిమెబ్బంగిఁక క్షణంబోర్తు; న
న్నీ వెంటన్ గొని పోవుటే యుచితమౌ; నీతిజ్ఞ ధర్మంబగున్
నీవారంబులమెక్కి గ్రుమ్మరెడి మానిన్ భూమిలోఁగానఁగన్ 80

దేవి వచనములాలించి, తృప్తినెంది
గిరి జనూరార్చి, యామెను గృపనుగొంచు
వృషభ వాహనారూఢులై ఋషినిఁజూడ
నీశదంపతు లేగిరి యులకువేడ్క 81

వృషభారూఢుఁడు నాగభూషణుఁడు సర్వేశుండు, రుద్రుండు మా
మిషలోలుం డభవుం డనామయుఁడు భస్మీభూతు డాద్యుండు,దు
ర్విషభోజుం డరుదెంచ దేవియుతుండై విజ్ఞాన సంపన్నుఁడా
ఋషివర్యుండు, సమాధిలోనఁ దెలిసెన్ రుద్రుండు వేంచేయుటల్ 82

మానిచెంగట వారలు మహినివెలయ
కన్నులారంగముదమునఁ గనుచు నతఁడు
భక్తిచేనమస్కృతులను బరగసల్పి
గిరిజహరులను బూజించె గీర్తిగనఁగ 83

## పర్వతుండు గౌరీశుల ధ్యానించుట (దండకము)

శ్రీమన్మహాదేవ శంభో! గిరీశా! మహేశా! విరూపాక్ష! మృత్యుంజయా! కృత్తివాసా! పినాకీ! కపర్దీ! భవా! భీమ! శూలీ హరా! వ్యోమకేశా! త్రిపురధ్వంసి! భూతేశ! యుగాక్షి! మహా కాల! శ్రీకంఠ! భర్గా! దయాసాంద్ర! కల్పాంతమందున్ త్రిలోకంబులన్ గుక్షిలోనన్ విలీనంబుగావించి యంతన్ బున స్సృష్టిలో నన్నిరూపంబులు న్నీవెయై వెల్గుచున్ లోకకళ్యాణ ముంగోరవే? దానవుల్ దేవతల్ సాగరంబున్మథించంగ హాలా హాలం బందురేగన్ దయాదృష్టితో వేగమేద్రావి లోకంబులన్ బ్రోవవే? తారకుండేపుచే స్వర్గమున్ జొచ్చి యందన్నియుంబాము గావింప నద్దిక్కులంజేరి యాలోకపాలు ల్దలల్ వంచఁగా బాధలం బెట్టుచుండంగ నా దేవతానీకముల్ బ్రహ్మలోకంబునుంజేరి పద్మా సనుంగొల్వఁ దానేమి చేయంగలేనంచు నీవద్దకుంబంప నాలోకసం హారకున్ దారకున్ ద్రుంపుకార్యంబుకై గౌరినింగూడి నీ తేజు నిన్ షణ్ముఖున్ వేగఁబుట్టించి యా దేవు నింద్రాదివర్గంబుపై సర్వ సేనాధిపత్యంబుగావించి దైత్యాదివర్గంబునెల్లన్ సమూలంబుగా నాజినింగూలఁగాఁజేసి యారాక్షసున్ రూపుమాపించి లోకంబులన్ గాచి, దిక్పాలురన్ బ్రోచి రక్షింపవే? భక్తులంబ్రోవవే? యాది

శక్తీశ్వరీ! లోకమాతా భవన్నాథునింగూడి యీలోకముంజే యేవేళ నేమాతృముల్ నీకు లేమానవుల్ జెందమండల్ దయాపూర్ణ బుద్ధిం గనుంగానవే? యో యుమాదేవి నీవెంతయున్ నాథునిం గూడి నన్నుద్ధరింపన్ దయన్ వచ్చుటన్ మత్పుణ్యాలేశంబునంగాదె యో మహేశా! భవానీ! నమస్తే నమస్తే నమస్తే నమః. 8

మత్తకోకిల. పార్వతీశ్వర! వేడెదన్ బహుకీర్తితో నిను-నాదిగన్
సర్వశక్తుఁడవీవె యాత్మవు సర్వతోముఖజీవులన్
నిర్వహించెద వీప్రపంచము నిర్మలత్వమునొందుచున్
సర్వమునుంగను చుందువెప్పుడు సాక్షివౌచుజగంబులన్

దేవా! జగంబులకునెల్ల యోనిబీజంబులైన శక్తిశి గారణుండవై నిర్వికారత్వంబునం జలించకుండు నిన్ను విశ్వనాథునిగాజను లెరుంగఁజాలరు. తావకాంశంబులైన శక్తి శివరూపంబు నంగ్రీడనలుపు, *తూర్ణనాభి(త్వరితగతి గలిగిన చక్రము)గతి, విశ్వజనన వృద్ధి వినాశ హేతుభూతుండవగుచుందువు. మఱియు, శుభమూర్తివైననీవు జగములమంగళకర్ములైనవారినిముక్తిని, నమంగళకర్ములయినవారిని నరకంబు నొందింతువు. నీవు నబ్జనాభుండును ‡బ్రాహ్మణాభాసులైనవారలయెడలను దృఢవ్రతచర్యులైనవారి

*తూర్ణనాభి=త్వరితగతిగలిగిన చక్రము ‡ బ్రాహ్మణాభాసులు= బ్రహ్మతేజస్సుచేఁ బ్రకాశించువారు.

యెడలను సాధుమూర్తులైనవారియెడలను పేక్షింపవు. నీవు సమస్త లోకంబులందు నఖిలకాలములందు దుర్లంఘనీయమగు పద్మనాభుమాయామోహము నందకుండఁజేసి సర్వజ్ఞుండవు. మాయచేత మోహితాత్ములైనవారికి నీభక్తిమార్గముంజూపి యుద్ధరించెదవు. నీయనుగ్రహముచే ముక్తికాములగుదురు. అవతీర్ణాఘసాగరుఁడవు; ముక్తిప్రసాదకుఁడవు; యోగిజనచిత్తకమల మకరందపానమత్తమధుకరంబవు. నీపద్మనభాగ్యంబునాకుముక్తి హేతువయ్యెననిమఱిమఱిస్తుతించెను. అంతమహేశుఁడు. 86

వత్సా! మెచ్చితి నీదుభక్తికని సద్భావోపసంసేవకున్
సత్సాంగత్యము పేర్మిఁ గాంచితివి యీసానందయోగంబునం
చుత్సంగంబునఁజేర్చి, యాతనిగృపన్ జూచున్ గడున్ దువ్వుచున్
మత్సాన్నిధ్యముఁగోరుమిచ్చెదను సమ్యక్ప్రీతిచే నియ్యెడన్ 87

నేత్రము లంత నెత్తి నవనీరజనేత్రను శంభుఁజూచుచున్
బాత్రుఁడనైతి మీదయకు పావనమూర్తిరో! కర్మబంధమే
నీత్రుటిలోన పాసితిక నీశ్వర! కోరెద మోక్షమార్గమే
నేత్రయిలోకసంపదల నొంతయుఁగోరను దేవదేవరా! 88

అంత యతిని జూచి యత్యంతకరుణను
మామహేశులలరి మానికడిరి
వరములనొగి రెండు వాంఛితమీడేరఁ
దమదుమూర్తులందుఁ దారుకొనఁగ 89

బసవండుకళలకా బసిడిని
వసదొడఁగుచు నచటనొప్పు బంధురభక్తిన్
వసుధమహేశ్వరుఁ డెలయఁగ
వసియింపడె? యీశునొద్ద బసవండెందున్ 90

ఇట్టుల నుమవి జటిలుఁడు సమృద్ధిభక్తి
సంతసంబుల వందన శతములొసఁగె
నందివాహనులగుచు నానందమొదవఁ
బార్వతీశులు వెడలి రపారగరిమ. 91

యోగివర్యుండు వైరాగి యోగధనుఁడు
శిష్యులాతని వెంటను జేరికొలువ
నేఁగెఁబడమటిదెస నొక యిరవుపడను
బుడమి నాతనిసత్కీర్తి పొంగిపొరలె. 92

## గ్రీష్మర్తువర్ణనము

భానుఁడు దీపితకరుఁడై
మానవలోకంబుఁజాలఁ గ్రమ్మగ్గింపఁ దృషా
దీసనదనములఁ బ్రాణులు
పానములఁ గ్రోలఁ సట్టి బాధలుతొలఁగెన్ 93

పృథివిని గాడ్పు నుంచగనె పిల్లగువేడిమియంటలెత్తన
ప్పృథిఁగల చెట్లనీడలను బాంధులు నిల్చిరి వంతవాయుచున్
గథలనుజెప్పుకొంచు దమ కాలముపుచ్చిరి పండితుల్ వడన్
రథములనెక్కి గ్రీష్మరుచు రంజిలుచుండిరి రాజశేఖరుల్ 94

పన్నీరు బొంపెలల్ పాన్పులందుంచుచు

వగఁబాసి రయ్యెడ భాగ్యవతులు

పచ్చకర్పూరంబు వసలెల్ల నలముచు

దాపంబువీడిరి తలిరుబోండ్లు

మంటిపాత్రలనీరు మఱిమఱిఁద్రాగుచు

నతిదాహమునువీడి రబ్జముఖులు

సెమటలోపలెల్లఁగ్రమ్మంగ సిగ్గువిడిచి

పైడి పవిటల వానిచే వీచుకొనుచు

జారలి రిటునటు నఱుగులనొరగియొరఁగి

బొజ్జకడుపులభోగివిల్ బుసలనిడుచు 95

వేడిగాడ్పుల వాడిన వృక్షలతలు

పండుటాకుల వ్రాల్చుచు బసరువీడి

యొఁడిసల్లాడె నయ్యెడ నేపుదొలఁగి

చందనంబులఁడికొనిన చామలొల్లు 96

ఉదయ స్నానసమయముల నొప్పమిగుల

బుత్తిగొంచును దాపంబు వొడమినపుడు

చంచుపుటులమీఁదికెత్తుచు శ్వాసలిడుచు

గోటరంబులఁబక్షులు గూడియుండె 97

కృషికు లెంతయు బయిరులు కృశతనొంద
గూపములనుండి యెడ్లను గూర్పఁబడిన
కపిలులవలన నీరంబు కడిమిఁగాను
గూర్చి మఱలుచుండిరి యింటికు నలసటను 98

పలుపలుచిన్నెల నభమ్ము పచ్చని పైరులు నీలమేఘముల్
తొలకరివానలెల్లెడలఁ దోటలలోఁ జిగిరించు వృక్షముల్
గొలఁకులఁదామరల్ పసులకోగిరముల్ సెలయేళ్లనీరముల్
గలుగుచు వేడిగాడ్పణఁగి కన్పడనంతట గ్రీష్మతాపముల్ 99



# శ్రీ పార్వతీ విజయము

## ద్వితీయాశ్వాసము

శ్రీకరముగ నిలఁ బ్రోవఁగ
ప్రాకటముగ మహిని శేషపర్వతశిఖరం
బాకరముగఁ గైకొంటివి
నీకరుణను గోరినాడ నిజముగ రమణా! 1

### గోపాలుఁడగు రాముఁడు

గొల్లకొలంబునం దమరె గోత్రజులెల్లరు పున్నె మందఁగా
నెల్లర లందు గాన ఘనుఁ డీతఁడటంచును మెప్పునొందఁగాఁ
బిల్లలు పెద్ద లెల్లపుడు ప్రీతిని దన్నుఁ దలంచుచుండగా
గొల్లఁ డొకండు రాముఁడనఁ గొప్పగునామమునం బ్రసిద్ధుఁడై

కారుమీసములను గ్రాలెడి మొగమునఁ
జెంపకుఁ జేరెడు జెలఁగుకండ్ల
జమిటిపోఁగులచేత జారినచెవులను
ముగుపోఁగులొప్పిన ముక్కు మొనలఁ
బెదవికిమించిన పెనుదంతచయముతోఁ
బెటేఁగినకాయంబు పెద్దబొజ్జఁ
గడియంబు లిడికొన్న కరపాదయుగములఁ
గరము వెడలైన యురముతోడఁ

గాలదాహమువలెఁ గఱ్ఱఁ గరమునసిడి
వలిప మొక్కటి మోకాళ్ల వఱకుఁ గట్టి
గొంగళిని బుజముపై నిడి గొల్లకోఁడు
సింహగర్జనమువలె శాసించుజనుల 3

అతఁడాగొల్లలకెంతయుఁ
ద్రాత యనంబఱఁగి సంతతం బితరులకున్
బ్రీతినిఁగలిగించుచుఁ దన
జాతిని నుత్సాహములెప్పుడు సాఁగక యేలెన్ 4

అతని గోపాలనమున
నేతరి గోవులకుఁ బొసఁగ వేకష్టంబుల్
మేఁతయు నీరును వృద్ధిగ
నేతెరువునైన యుండె నింపుదలిర్పన్ 5

ఇతని యిల్లాలైన లక్ష్మియు 6

పట్టెడుకుంకుమ నొసట బద్మముపోల్కి నిఁబొట్టువెట్టి, పెన్
దట్టఁపునేతబట్టను బదంబులపైఁ గెగఁగట్టి కాళ్లకున్
మెట్టెల నందెలందొడఁగి, మోచనుమిట్టలఁజుట్టిపైఁట దాఁ
బుట్టిన మెట్టినిండ్లనెడఁ బూజ్యయనన్ బొగడొందె నెల్లెడన్ 7

## సురభి రామునింటఁ బెరుఁగుట

కామధేనువు పుత్రమిని గపిలవర్ణ
గోవుగా జనియించెను గొమరుమిగిలి
రామునాలను బెఱుగుచు రక్తిగాంచె
బృథ్విలోపల నెంతయుఁ బేరువడసి 8

కొంతకాలంబుగడవంగ గోవుకమరె
నిండుచూడగుచిహ్నంబు నిక్కముగను
ముదముగొల్పెడి గ్రేపొకటి యొదవెఁబిదప
దానిఁగని జను లదియొక దైవమనిరి 9

రాముం డరుణోదయమున
నీమతితో నిద్రలేచి నేఁకువమీఱన్
నీమముతోఁ దనకార్యము
లేమరకను జేయుచుండు నెనసినశ్రద్ధన్ 10

ఆవులమందకు దూడల
తావులఁ దప్పించి త్రోలి దల్లులవద్దన్
గావలసిన పాలుంగొన
గోవులనెపుఁ దానుగొంత గొంచునుబోవున్

కదుపు లెల్లను దల్లులకడను జేరి
తమ్ముఁ దల్లులు నాలుకల్ దనరఁ జేర్చి
స్పర్శసేయుచునుండంగఁ బాలుద్రావి
గంతులిడుచుండు దూఁతయు వింతగొలుపు

కపిలధేనువు నెపుఁ దాను గరుణఁ గలిగి
యనుదినం బోతఁ దద్దాని సమరఁ గడిగి
యింటికిని జేరినంతనే యిష్టమలర
గసవు, పిండియుఁ బెట్టును గడుపునింప

క్షీరంబుపితుకఁడు చిప్పిలుచున్నను
దూడకు విడుచును ధారముగను
కట్టుచోటను జిమ్మి కడిగి శుభ్రముసేయు
నొడలెల్లఁ దోమును దుడుచు మేను
బాదశృంగంబులఁ బలువన్నె త్రాళ్ళులఁ
జుట్టి గజ్జలపేర్లు గట్టియుంచు
నిల్లాలు దానికి నెనసినవేడ్కతోఁ
బసుపు గుంకుమ బొట్లు నొసటఁ బెట్టు

దంపతులు దానిఁజుట్టి ప్రదక్షిణముల
నొనరఁ జేయుచు దాక్షిణ్య మొదవ మేఁత
లిడుచు దానిపై మురిపెము లెంతొగలప్పు
చంద్రు నిత్యమును బరమోత్సుకముతోడ

అంత, 15

రాముని యిల్లాలెప్పుడు
తామస మింతైన లేక తన పెనిమిటికిన్
రాముని కాన్పు పెరుఁగుతో
ప్రేమం బలరంగఁ జల్దిఁ బెంపుచుఁ బెట్టున్ 16

బోనమారగించి బొజ్జను దువ్వుచు
గొంగళెత్తి బుజపుఁగొనసు దాల్చి
చేతనొక్క పెద్ద సెలకోల నూనుచు
పక్క లాకులందుఁ బడతివలన 17

దొడ్డిలోపలి యావులఁ ద్రోలి వెలికి
చుట్టుప్రక్కలఁ బోకుండ 'జో చో' యనుచు
గోపబాలురు వానినిగూడి చనఁగ
మురళి మ్రోగించి రాముఁడు ముందుఁజనును 18

ఒకనాఁడావు లరణ్యమందుఁ దృణము ల్లొప్పారఁగా మేసి యం
దొకచోటన్ గుమిసేరె; గొల్లలొకచో నుత్సాంతతో నాడుచున్
సకలంబున్ మరపొంది; రంతట నటన్ సద్గోవుగాన్పించ తే
దకటా! గొల్లఁడు దానికై తిరిగె నాయారణ్యమర్గంబులన్ 19

ప్రొద్దుక్రుంకు వేళఁ బొడకట్టెఁ బొదరింటఁ
గపిలధేనువు దనకదుపువీడి

పాలుకార్చుచుండ భక్తితోఁ ఋషిముని,
గ్రేపుకయ్యకునికిఁ గినుకనొంది

## కపిలధేను వదృశ్యమై రామునికి లింగంబుగాన్పించుట

సెలకోలతోఁ దానిఁ జెవరఁగొట్టంగనే
ధేను వదృశ్యమై దివికనేఁగ
నచ్చోటఁ ఋషిముని నటునిటు పరికింపఁ
బుట్టయొక్కటియుండె భూమియందు
నందున్న బిలమునం దహించనుచుండంగ
నతఁ డదిగాంచె నత్యాగ్రహమున
నురగంబు ననుమార్గ మున్వినిఁద్రవ్వఁగా
నుద్యుక్తుఁడై పొదలూడఁ బెఱికి

గుద్దలిసిగొంచుఁ బెకలించెఁ గుంభినివడి
నంతఁ గన్పడె శివలింగ మధికదీప్తిఁ
బాలతోఁ బడియుటఁగని భయము సెందె
నసితగోవున కపకార మయ్యెననుచు 21

చిటపటనొందుచుఁ గనక చేసితి నిందితకార్య మింతలోఁ
దటుకున నావుఁగొట్టితిని దానిప్రభావమెఱుంగనైతి నేఁ
బటుతరభాగ్యధేనువును బాసితి నీశ్వరుసేవసేయఁగా
నెటులనటంచు నార్తుఁడయి యేఁగెగృహంబున కంకిలిఁ వడిఁ

లక్ష్మి యొరాత్రిఁగనుచును బక్ష్మయుగము
లో త్త్రి వెశలెడి బ్రాహ్మము లుత్తరీయ
మునుఁదుడిచి, యిట్టులేటికి మోదముడిగి
కుందుచున్నవాఁడవనఁగఁ గూర్మినుడివె 23

గోవుల్ నేఁడువనంబులోఁ దిరుగఁ
గాఁగొంటొక్కఁడు పోఁ జిత్రమా
తావుంజేరితి మెల్లవల్లవుల
మింతన్ బ్రీతితో నాటలన్
తివిన్ గాలముపుచ్చుచుండఁగను
గంటిన్ గోవు లేకుంట నం
తావేళన్ దిశలెల్ల నే వెతక,
నల్లా వెందులేదయ్యెడన్ 24

గోవులఁ గాచుచుండుమని గొల్లలతోఁ దగఁజెప్పి దుర్గమా
తావుల కేఁగి యొక్కెడను దప్పక కాంచితిఁ బుట్టమీఁద నా
గోవు విమూఢబుద్ధిఁ గడు కోరికఁ బాలనుగార్చుచుండ నేఁ
డీవర మైన కోపమునఁ దేఁకువవీడఁగఁ గొట్టితిన్ వడిన్ 25

అంతలో గోవుగాస్వంప వచటఁ భీతి
బుట్టఁద్రవ్వితిఁ; గాంచితి భూమియందు
లింగరూపంబు దేజరిల్లంగఁగళల
క్షీరసిక్తంబులై యుంటఁ జింతఁగొంటి 26

ఆవుకా దది గోరూపదైవమకట!
కామధేనువు మనపుణ్యకర్మవశత
సెలఁగె మనయింట; భక్తిని శివునికొలుచుఁ
బాలుగార్చుటఁ దెలియమి భంగమొదవె 27

ఇట్లులఁజెప్పుచుఁ గనులన్
బొట్టులు వ్రాలంగనేడ్చి పుడమిని ద్రెళ్లెన్
కట్టడిదైవము వారల
కెట్టిడుములఁ దెచ్చిపెట్టె నెంచఁగ నకటా! 28

## రాము నాతనిసతి యూరార్చుట

గొల్లని యిల్లాలతని
మెల్లఁగఁ బతియొద్దఁజేరి మెత్తనిపల్కుల్
ఉల్లమలరంగ నుడువుచు
జల్లని యుదకమునఁ దుడిచెఁ జక్షుర్ద్వయమున్ 29

పతినూరార్చి యనంతరంబు నెనసీ! పాపంబిటుల్ గూర్చెఁ గా
మితిమీఱెన్ గతకార్యచింతనమిఁకన్ మేల్గాదు నీవీశునిన్
సతతంబున్ మదినమ్మి కొల్వ నటుసంసక్తంబులౌ పుణ్యముల్
క్షితిలో నెన్నియొ పొందవచ్చునిఁక నిశ్చింతన్ హృదింబొందుమీ

ఇటులఁ దారచే నుపలాలితుండై తృప్తినసక, విచారసాగర నిమగ్నమానసుండై, యాతేయి యాహారపానీయంబులుముట్టక

నిత్యము నాయసితధేనువు మేయుచుండు చోటులం దిరుగుచు, నాస్థానంబులం దాఁ బరుండుచు, ననంతరం బాస్థలంబున నిష్ఠధేనువు గల్పించి దానికిం బూజగావించి వినయవినమితశిరస్కుండై దండ ప్రణామంబు లొనర్చుచుఁ, దాఁజేసిన యపరాధంబు సైరింపం బ్రార్థించె. అంత జతుర్థయామంబు సమీపింప, నుపవాసశ్రమంబునం జొక్కి, కూర్కుం జెంద, నాతనికి స్వప్నంబున విస్మితంబగు లోకశృంగి నిండోలుకొనిపోవుచు నావిప్రుం డీకిలారితో నిట్టుల సంభాషింపం దొడంగెను. 31

## రామునికి స్వప్నము

ఓపుణ్యా! తొలినీశునందు భవదీ యోపాసనా, ధ్యాన, పూ
జా, పారాయణ భక్తి సేవలకు నుత్సాహంబునుంబొంది నీ
పాపంబుల్ బరిమార్చ దేవుఁడు కృపన్ బ్రత్యక్షమయ్యెం ధరన్
నీ పైఁగూర్మినిఁ బుట్టె నా సురభియున్ నీయింటిలోఁ గోవుగాన్

కామధేనువు నీయింటఁ గడినిఁ బెటిఁగి
కృత్తివాసు దర్శనమును గృపనొసంగి
దేవలోకంబు సేరుచుఁ ద్రిభువనముల
దిరుగుచున్నది; దానికై దిగులువడకు 33

నీవు కన్నట్టి లింగంబు నిక్కముగను
నీశుకళలచేఁ జెన్నొంది యేపుఁ దనరె;

పూర్వమయ్యాది దుర్వాసముని మహేశు
భక్తిఁబ్రార్థించి యబ్బవి భవునినిలిపె

ఏను శివుఁడను, నీమొనర్వేశ, గౌరి,
కామధేను విదియనుచుఁ గథను దెలిపి
వారలంతటఁ గ్రుంకిరి వారినిధిని;
దెలిసె నిద్రను గొల్లండు తెలివినొంది 35

అంత నాస్వప్న వృత్తాంతంబు దారకుం దెలిపి. 36

కంటిని నేస్వప్నంబును
వింటిని పరమేశుకథను విశదముగాఁగన్
దుంటరిమూఁకం జేరక,
యింటనిఁ దగవీడిపోద, మీశునికడకున్ 37

ఇటులా కీలా రీశ్వరునందుఁ దగులొ్కనిన చిత్తంబుతోఁ
దమసర్వస్వం బీశ్వరాయత్తంబు సేసికొనియుండునెడ. 38

## సూర్యోదయ వర్ణనము

అస్తగిరినుండి చంద్రుఁ డయ్యంబురాశి
నెగిరి దుముకంగ నాతని యేపుఁజూచి
వెఱఁగుపడినవో యనునట్లు వెలవెలనయి
తప్పమునొందెను వినువీథిఁ దారకలును. 39

ఉడుపతి యామినీసతిని నుత్సుకతో సమయంబువేచి యా
గడపలపాన్పు పై దివిచి గాఢముగా నడికౌఁగిలించునాక్
సడలిన కంఠహారమునఁ జారినచక్కని ముత్తెమొక్కటా
యడుగున వ్రాలెనో యనఁగ నబ్బెను వేగురుఁజుక్క తూర్పునన్ 40

ప్రత్యూషనరుండు గగననేపథ్యమందు
నంధకారావనిక వేగ నలరనెత్తి
యర్కగాథమహారూపకాది నిడ్డ
హారతోయనఁజూపట్టె నరుణకాంతి 41

కొక్కొరొకో యటంచుఁ దొలి కోడాగిఁ గూసెను గూటిలోపలన్
మెక్కిరి చద్దియన్నమును మేదినిదున్నఁ గృషీవలుల్ వడిన్
జక్కవపెంటిఁ బిల్చె నతిసమ్మతివీడిన నాథుఁ గ్రమ్మఱన్
ఎక్కువప్రీతితోఁ బథిని నేఁగఁగ నుండిరి పాంథులూళ్లకున్ 42

ప్రేయసిబాహువుల్ బిగువుగాఁ బెన్చిన
మగని నొత్తిలఁజేసె మగువయొకతె
స్తన్యపానంబున దమిగాంచు బిడ్డని
మొగమును మఱలించె ముగుదయొకతె
తోడికోడలుముందు పీడెఁ బాన్పు నటంచు
గాఢనిద్రను వీడెఁ గలికియొకతె

ఇరుగుపొరుగువాండ్రు సరగఁజేసిరి యిండ్లఁ
బనులని మేల్కొనెఁ బడఁతియొకతె

ఇట్టు లాగొల్లపల్లెయం దిమిడియుండు
నాడువారును గృహకార్య మవసరములఁ
దీర్చుకొనుటకు మేల్కొని తిరుగుచుండ
రాముసతియును మేల్కాంచి రమణులేపి

గృహకృత్యంబుల నెల్లదీర్చుకొని దర్శింపంగ గౌరీశునిన్
బహుళామోదముగూర్చుపుష్పతతులన్ బత్రంబులన్ బండుఁ
మహిమంబైన రసాన్నపానకములన్ మాధుర్యభోజ్యంబులన్
విహితంబొప్పఁగఁగూర్చె వారడవికిన్ వేవేగఁగొంపోవఁగన్

రాముండు తానంబు రయమునఁజేసెను
ధౌతవస్త్రంబులఁ దనరఁగట్టె
భస్మంబు నొడలెల్ల బహువిధంబులఁబూసె
బువ్వులసిగకును బొందుపఱచె
గంధంబునుదుటను గంటికింపుగఁబెట్టె
గుంకుమనందుపై గూర్మినునిచె
రుద్రాక్షహారముల్ రుద్రునివలెఁదాల్చెఁ
బూలపుట్టికఁ గేల బూని నడువ

గృహిణి తనవెంటభక్తిని గీలుకొనఁగఁ
గోపకులు వస్తుచయమును గొంచురాఁగఁ
గర్మబంధమ్ము త్రెంచుకఁ గదలినట్లు
గోపకుఁడువీడె గృహమును గుతుకమొదవ 45

కాంచి రరణ్యమందుగల కామహరుఁ శివ వారికంతఁగా
వించిరి మజ్జనంబుఁ బ్రభవించినభక్తినిఁ దృప్తినొంద న
ర్పించిరి పత్రపుష్పముల నింపగుభక్ష్యరసాన్నముల్ సమ
ర్పించిరి వందనంబులొనరించిరి యంతనభీష్టసిద్ధికై 46

ఇటులాగోపదంపతులు సకలకర్మబంధకంబగు సంసార బంధకంబు క్రమంబుగావీడి గిరీశులందు బుద్ధినిల్పి, వారలసేవా కైంకర్యంబులచేఁ గాలంబుగడపుచుండ నొక్కనాఁడు గొల్లండడవికింబోయి శంకరార్చనకై పత్ర, పుష్ప, ఫలాదులంగోయుచుండె అత్తఱి నాజేరువనొక కొండచరియయందు నాఁకలిఁగొని యాతురయై తృణంబులమేయుచుఁ బ్రమత్తయైయున్న గోవుపై వ్యాఘ్రంబొండు పొదచాటునంబొంచి దుముకఁగమకించుటంగని యాధేనువును రక్షింపంబ్రయత్నించినవాఁడై తన ప్రాణంబులపై నాశ వదలి, గోరక్తపానాసక్తమైయున్న యాశార్దూలంబుమీఁదికిఁ గార్చిచ్చుపై దుముకు ఖద్యోతంబువగిది చేతనున్నగొడ్డలితోనురికెను; అంతనాచాటిలమొక మతికుపితయై యాధేనువునువీడి గొల్లనిపైఁబడి తన నిశిత నఖాగ్రంబులచే నాతని యంగంబులజీల్చివైవ

నాతండు ధైర్యంబువిడువక చేతికులిశంబునం దానిశిరంబుపై నొక్క పెట్టుఁబెట్టె. కాని లక్ష్యంబుచేయక వ్యాఘ్రం బతిరోషంబున నాతనిపై లంఘించి ఘోరోదగ్రదంష్ట్రలచేనాతనికుత్తుకనొత్తనోటం బెఱచెను. అంతలో నెటనుండియో సూటిగానొక సాయకంబా పులినోటం జొరబడియె; మఱొండుశరంబు కంఠంబునం గ్రుచ్చుకొనియె. నాగాటంపుప్రేటులకుందాళఁజాలక, యా పుండరీకంబు నేలంగూలెను. ఘోర భీకరోదగ్ర వ్యాఘ్రదంష్ట్రాఘాతోన్ముక్త రక్తసిక్తాంగుండును వేపమానశరీరుండు నశ్రుకణస్రావనిమీలితనేత్రుండునగు నాకీలారి భూమిపై నొడలెఱుంగక విగతప్రాణుంబోలి పడియుండెను. అత్తఱినొకయువకుఁ డశ్వావరోహణముసేసి ప్రాణావశిష్టుండై యున్న యాతనికి శైత్యోపచారములు గావించుచుండె.

చూచెంగొల్లఁడు సార్వభౌము రవితేజుఁ సాహసోపేతునిఁ
వాచాలుఁ ఘనదీర్ఘబాహు విలసద్భాగ్యుఁ మహోదారునిఁ
సాచారుఁ శరణాగతావను లసచ్చంద్రోప మానాననుఁ
ధీచాతుర్యుఁగృపాణహస్తునొకనిఁ దేవాంశసంభూతునిఁ 48

అంతట రాముఁ డాతనిపదాంబుజముల్ దగనంటి దేవ న
న్నింతటివానిఁజేసితివి యెవ్విధిఁజూచితి మీవునాదు క
ష్టాంతరముఁ హుటాహుటిగనావునునన్నునుఁజూచిబ్రోచితే?
యెంతటిపుణ్యుడఁ మిములనియ్యెడగాంచుట భక్తిగొల్చుటల్

ఎయ్యెడి మీప్రాపునే పొందివర్ధిలు
నెందలినరులు మిమ్మొప్పుమగొల్తు
తేజన మీగాల కేప్రొద్దుఁజింతింతు
రెవరుమీయెడఁబాపు కేవగింతు?
ఎందుండి మీరిట కేఁగుదెంచితి రిప్పు
డెచ్చటికేగఁగనిచ్చవొడమె;
ఏనిమిత్తంబున నీకాననంబులఁ
దిరుగాడుచుంటిరి తెంపుమీర;

దెల్పుమా! దేవ! నాపాలిదివ్యమూర్తి!
ఇందుమౌళి యేనిట కంపెనేమి? లేక
యతఁడవే నీవు? వచ్చితో యరిదిగాప
తండ్రి! సద్గుణజలనిధి! ధర్మమూర్తి! 50

నీతిమంతుఁ డిటువినీతంబులగుపలు
కు లతియుక్తియుక్త మొలయఁబలుకె,
భూమిధవుఁడు సెప్పెఁ బ్రోడమిన దయతోడఁ
దనదుచరితమెల్లఁ దప్పకుండ 51

## నిమిభూపతి దనచరిత్రంబుఁదెల్పుట

పుడమిని బుణ్యము నొందఁగ
నెడతెగకే తెంచుజనుల కెంతయుఁ బ్రీతిఁ

జడతను మాన్పుచు వడిఁగల
నడకను నీరంబులుండు నదిగలదిలలోఁ 52

అదియు సరయూనదియు; దాని నంటియుండు
పట్టణం బయోధ్య; మనువు పాలితంబు
అతని పాలనమున జను లమితభక్తి
గొలుచుచుండిరి ప్రభువును గొఱఁతలేక 53

‡ఒకనాఁడు మనువుతుమ్మినఁ
బ్రకటితముగ నతనిఘ్రాణ రంధ్రము వెంటన్
సుకరుం డిక్ష్వాకుండన
నకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై 54

ఇక్ష్వాకునకుఁ బుత్త్రు లెన్నంగ నూర్వురు
నేనొకం డందుల నిమియనంగ,
భూభారమును వడిబూనంగ, నగ్రజుఁ
డంత నేవెడలితి నవనిఁజూడ,
మాగురువర్యుఁ డీమాని వశిష్ఠుండు
మహిని తీర్థములెల్ల మాకుఁజూపఁ
బుణ్యనదులఁ దోఁగి పొడసూపితిమి యిందు
నీశ్వరుఁజూడంగ నిచ్ఛగలిగి,

[‡ 47 వ పేజీలో చూడుడి]

యూతలోఁ బ్రాగ శ్రాద్ధకాల మేఁగుదెంచి
నిన్నుఁ జంపంగఁ బూనుట నేనుఁ గాంచి
వానిఁ గూల్చితిఁ బ్రోచితిఁ దక్షిణాంబ
యతఁడె నానివర్యుం డిట కరుగునాఁడు 55

---

‡ భాగవతము-నవమస్కంధము-పద్యములు ౧౯౩

క. ఒకనాఁడు మనువు తుమ్మిన వికలుఁడుగా శతని ఘ్రాణరంధ్రము వెంటం, బ్రకటయశుం డిక్ష్వాకుం, డకలంకుఁడు పుట్టెకవికులాధీశుండై

ఇక్ష్వాకునకుఁ బుత్రు లెలమిఁ బుట్టిరి నూర్వు
రమర వికుక్షియు నిమియు దండ,
కుండు నాతని పెద్దకొడుకులు మువ్వు రా
ర్యావర్తమందు హిమాంచలంబు,
వింధ్యాద్రిమధ్య మర్వీమండలముఁ గొంత
యేలిరి యిరువది యేగు రొక్క
పొందున నాతూర్పుభూము లేలించిరి
యందఱు పడమటి కధిపులైరి

యున్న నలువది యేడ్వురు నుత్తరోలు
దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర
సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన
మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు

మునివరుఁ డేఁగుదెంచె నగుమోమున సుందరవల్కలంబులన్
ఘనమగు నక్షమాలను సుగంధమయంబగు లేపనంబులన్
దనువునఁ బూదిరేకలను దండకమండువుల్ ధరించి,
బనివడి బ్రహ్మతేజమున భర్గుఁ డిలన్ వడిఁజొచ్చెనోయనన్

మ్రొక్కెను మౌనికిన్ మిగులమోదముతోఁ దలవంచిగొల్లఁ డిం
పెక్కిన భక్తిచే ఋషిని నేర్పునఁగొల్చెను జాలనర్ఘ్యచేఁ
జక్కఁగఁబూజచేసె బహుసమ్మతిగొల్చెడు పుష్పరాజితో
నెక్కువప్రీతితో నతనినెంతయు నిల్పెను నెమ్మనంబులో 57

ఇటు లాభీరుం డాతనియిల్లా లాఋషివర రాజవరుల కుపచరించి వారేయేతీర్థంబులఁ గ్రుంకినదియు నేయేపుణ్యస్థలంబులఁ జూచినదియు నేయేస్థానంబుల నెట్టిమాహాత్మ్యంబు లుండునదియు సవిస్తరంబుగాఁజెప్ప సవినయంబుగాఁ బ్రార్థింపం గరుణించి, వసిష్ఠఋషి శ్రేష్ఠుం డిట్టుఁజెప్పందొడంగె. 58

సహాగతజనములఁ గొనుచును
మహాతర తేజంబు వెలయు మహిానిఁగనంగన్
బహుదివసములఁ గడిపితిమి
గహ నాద్రి నదీ పురాదిగణముల యందున్ 59

*గంగాంబువులఁ దేలి కైలాసమునుఁ గొలిచి

హిమవద్గిరికిని గమనమొంది,

బదరికాశ్రమమును బడఁబడి తిలకించి,

కేదారమునకును గేలుమొగిచి,

యమునసంగమమందు యాగంబు నొనరించి

కాశికాపురినీశుఁ గడిమిఁగొలిచి,

భద్రాద్రిరాముని భక్తితో సేవించి,

గౌతమీనదియందు గరముగ్రుంకి

తుంగభద్రానదీరత్నతోయమాడి,

కృష్ణవేణ్యాపగా జలాకృష్టిఁ దన్పి

వరపినాకినీ నీరంబు వాంఛనంది,

సోమశైలంబు చెంతకుఁ జొచ్చినాము

---

* పినాకినీ మాహాత్మ్యము పేజీ ౭౨,౭౩. షష్ఠమాశ్వాసము నిమివశిష్ఠాదులు తీర్థయాత్రకుంబోవుట.

పేజీ ౭౩వ "సహాగత జనులతో సరసతగదలి, వఁపినాకిని చెంత వసియించునట్టి సోమసోమేశ్వరు సర్వలోకేశు యుగు పార్వతీశ్వరునపుడు వీక్షించి......

యాక్షేత్రప్రాగ్భాగ మందుండు పావ కాక్షుఁడౌ

సోమేశు పాదాంబుజములు, కమలబిల్వాక్షతగంధ

సుపుష్ప సమరసఫలముల సమతబూజించి...

అంతటను దరలి యాదిపీఠ సంగమేశ్వరు జూడసరసతజేరి,



[* 50 వ పేజీలో చూడుడు]

అందులకుఁ బొంతనుండెడి నాదిదేవు
నవని బిల్తురు సోమేశుఁ డనెడిపేర
నచటి కేఁగితి మా దేవు నమితభక్తిఁ
బూజసల్పి తిమటనుండి పూర్వదిశను 61

ఒప్పియుండిన కోటీశు నొద్ద కేఁగి
కడిమి లింగంబున కభిషేకంబుసేసి
తివిరి పూజించితిమి దేవు దివ్యముగను
గమల బిల్వ గంధాక్షత కాంచనముల 62

పదఁపడితరలి ఫలపుష్పభరితమైన
వృక్షములకందు నభినవవృద్ధిఁ జూపు
వాటికలపజ్జఁదనరెడి మేటికొండ
నరసఁగల, నదీసంగమా సంగమునకు 63

పు రా.క.ర;— అటఁదర్లి దూర్వాసునాశ్రయాధీశు
కుటిలపన్నగభూషు కుజనాళికోషు, గంభీర భా
షు యాగమశిఖాభూషు, నంభశ్శిరోయాషు నఘసంఘ

కోషుఁ డైన దూర్వాసేశు నందందఁగొల్చి మానిత
భక్తిచె మార్గంబువెడలి శ్రీజన్నవాటికి స్థిరముగఁ
జేరి, భూజనులుపొంగ భూతనాయకుని కన్నుల
పండువుగాఁగవీక్షించి సన్నుతిసేయంగ సఫలమటంచు.

చేరితి మతిసౌఖ్యంబుగ
సీరికలె త్తంగ సంగమేశునిజూడన్
గౌరిని శంకరు బ్రీతి న
పారముగా బూజసల్పి పదపడివేడ్కన్ 64

సంగమమందు నానదిని సమ్మతి మజ్జన మాచరించి ని
స్సంగమబుద్ధితో బిదప సల్పితి మాన్యలిఁ జైత్రకర్మలన్
గంగను గుర్తింకు చుండుతటి గాంచన రత్నములెల్ల నాశలా
రంగను బేదసాదులకు రాజోసఁగెన్ జనులెల్ల మెచ్చగన్ 65

అంత నదీతీర మరుగచు వేడ్కతోఁ
బూర్వ దిగ్భాగమా పుడమిఁజూడ
నే తెంచి, పిమ్మట నిరుగడలంగల
తటుల సై కతమయ ధరణి విడచి
చేరువనున్నట్టి చిట్టడవులఁదాటి
సొబ గైనపచ్చిక చోట్ల కరిగి
యచ్చోటఁ దిరిగెడి నాశ్రమ మృగముల
సంపదలంగని సంభ్రమమున

వృక్షముల వృద్ధి సెలయేర్ల వింతగనుచు
పక్షిరవముల వినుచు విస్పష్టముగను
కొలఁకులందలి పద్మముల్ గొలదిఁగొనుచు
మంద గమనంబు ననురాఁగ నిందు నెటను 66

సుమఫల బంధురంబులగు శోభిత పల్లవ భావితంబులౌ
శ్రమపరిహార కంబులగు సర్వసమున్నత వృక్షశాఖలన్
భ్రమణముసేసి వెల్లెగసి పంక్తిగ వ్రాలుచుఁగొన్ని వేళలన్
గుమిపడిసేరు పక్షులను గోరికఁ గాంచితి ముత్సుకంబుగన్

పరిమళ పుష్పసంభరిత పాదపజాల విశాలపత్ర మం
దిరముల డాగురింతలనఁ ద్రిమ్మరి పెంటులఁబిల్చుటోలె సు
స్వరగత మాధురీవచన సంపదలన్ వెదఁజల్లుఁ గోయిలల్
అరమరలేక 'కూ' ధ్వనుల నందొనరింపఁగ వింటిమెంతయున్

సురుచిర కోమలంబులయి, సూర్య విదాహమరీచి కాళికిన్
గుఱిపడనట్టివై, విమలకోరక కుట్మల గుచ్ఛకంబులన్
గరము మనోహరంబులయి కమ్మని తావినిఁగూర్చు పెక్కు
సరసఁపు మల్లికాలతల సంపదఁ గంటిమి వింతఁగూర్పఁగన్ 69

రవికిరణంబు లూర్జితపరంపరలై నెగడొంద నుష్ణతా
ప వదనయా భుజంగము నపారకృపామతితోడ వేడ్కఁ జూ
చి, వనటఁబాపఁగా శిఖివిజృంభిత పక్షములందఁజేసి దా
నవిరళమైత్రి జూపుట ననంతము దంబొనఁగూడె మామదిన్ 70

సుకరముగాను కేసర కిశోరము మాతను జేరి ప్రీతితో
నొకచనునంది, పాలుఁగడుపుబ్బగ ద్రావుచునుండ నన్యమున్
బ్రకటిత నిర్భయంబునను బానముసేసెడు నాకురంగ శా
బకమును సింహిజాలిఁగనఁబర్చుట జూచితి మొక్కచోటనన్ 71

ఇవ్విధమున గంటిమి మే
మివ్వనమున నిట్టివింత లెంతయుఁ గనిమిన్
నివ్విపినంబునఁ బుణ్యుం
డెవ్వఁడో? గలఁడంచు మదికినేర్పడెఁ గడకన్ 72

## వశిష్ఠమహర్షి రామునికి దుర్వాసమౌనీంద్రుచేఁ బ్రతిష్ఠింపఁ బడిన శివలింగ విశేషములం దెల్పుట

పూర్వ మొకప్పుడు మహర్షి శ్రేష్ఠుండగు దుర్వాసుం డీనదీ తీరంబునఁ బ్రతిష్ఠించిన మహేశ్వరలింగం బీస్థానంబున నుండు నని మాకుం దోఁచి, యీప్రదేశంబుం గనవచ్చితిమని చెప్ప, నాభీరుం డాకథా విశేషం బేమని మిగులవేడ నాతం డిట్టుల వచించె. 73

దుర్వాసుండను మహర్షివర్యుఁడు శివున్ దోరంపుభక్తిన్ మదిన్
నిర్వక్రంబుగ వేఁడి దేవుదయ సాన్నిధ్యంబుఁ దాఁబొంది యా
శర్వుం డిచ్చుట సర్వకాలము మహాసంశోభతో నుండ నా
సర్వేశున్ మఱిఁగోరె నీజగతి శశ్వత్కీర్తిఁ దాఁబొందుచున్

విని మేమాశివు పాదపద్మయుగమున్ వేగంబ పూజింపఁగా
బనిఁగొంచున్ దగనేఁగుదెంచితిమి యాభర్గున్ గృపన్ జూపుమీ?
వినవే? తొల్లిటి నీకథన్ బుడమిలో విజ్ఞుల్ వచింప న్దగన్
గనలేదా? హారదివ్యరూప మిట నీకాంతార దుర్గంబులన్ 75

అంత టాకీలారి దేవా! ఇచటికనతిదూరంబుననే మహేశ్వరలింగంబుగలదు; ఆపరమేశ్వరు దివ్యపాదార విందముల నేనను దినంబును భక్తిఁగొల్చుచున్నవాఁడ నాజన్మ పావనంబుజేసి, రుద్రుడు నిజరూపంబు ప్రత్యక్షంబుగాఁ గంటిననిచెప్పి, వారిందోడ్కొని, పినాకినీనది చెంతకుంబోవ వారానదియందుఁగ్రుంకిరి. అనంతర మాఋషివరునకును, భూవరునకును శ్రీ దుర్వాస ఈశ్వరుని యొక్కయు, బార్వతీదేవి యొక్కయు దర్శనములనందఁజేసెను.

గొల్లఁడు కుసుమఫలంబులఁ
గొల్లులుగాఁదెచ్చి ఋషికిఁ గూరిమినొసఁగన్
జల్లని నీరముతో హరు
నల్లమలరఁగ నభిషేక మొనరించె నంతన్ 77

తడియొత్తి పట్టుబట్టను
మడుపుల శివునొద్దనునిచె మంజుల ఫణితిన్
మడిసంచిలోని బూదిని
నినిటలమునం ద్రిపుండ్ర మేర్పడవరుసన్ 78

లేపనములఁదెను; దేహాపుఁ
దాపము వీడంగ వీచెఁ దగవీవనతోన్;
నేపునఁ బూజనొనర్చెను;
ధూపంబుల నొసఁగె బాదతోయజములకున్ 79

అర్పించె మధుర ఫలములఁ
గర్పూరపు హారతిడెను గరదీపికతోన్
సర్వాలంకారున కటు
నోర్పుమెయింజూపె భక్తి యొనరఁగ మదిలోన్ 80

పూజించెను బార్వతి ని
ర్వ్యాజంబగు నమితభక్తి రక్తియుఁ గుదురన్
భూజనులు మెచ్చిపొగడఁగఁ
దేజం బెసగంగ దేవితృప్తింబొందన్ 81

భూవరుండును దేవతా పూజసల్పి
పుడమిసోఁక నమస్కృతుల్ పొసఁగఁజేసి
పార్వతీశుల మనమున బరగనిల్పి
ధ్యానమును జేసెమించిన తాల్మితోడ 82

అంత సూర్యాస్తమయ మగుటయు 83

—: సూర్యాస్తమయ వర్ణము :—

రవియోధుండు త్రిలోక సంవనన సంరంభంబు దీపింపఁగా
గవిపైన్ దీక్షుఁడై యనంత రణరంగస్థాన మచ్చోటఁ దా
నవలీలన్ విజయంబునొంది శ్రమబాయన్ బశ్చిమాంభోనిధిన్
అవగాహంబును జేయువానివలె నస్తాద్రిన్ మఱుంగై చనెన్

♦ సంవనన సంరంభము = వశ క్రియాటోపము

రోష కషాయనేత్రగత రూక్షణవీక్షణ భాస్కరోర్మికల్
భీషణమొప్పఁగా గగనవీధి నటింపఁగఁజూచి భీతిచే
బోషకులెవ్వరంచుఁ దలపోసెడి మానసచింతచేత సం
తోషము వాసెనోయనఁగఁ దోచెను రిక్కలు మిన్కులై దివిన్

ప్రభువుపీడిన పృథివినిఁ బరిఢవిలెన్
నంధకారంబుపొల్క నయ్యాకసమునఁ
జీఁకటులుగ్రమ్మె నటజెలఁగెఁ జుక్క
లోడిపాఱిన సైన్యముల్ గూడినట్లు ౪౩

సూర్యుని తీవ్రకోపమున సుక్కయుఁ జంద్రుఁడు మొక్కవోక యా
క్రౌర్యముచేఁ బ్రతీకమగు కార్యవశంబునఁ గీర్తి సేకొనన్
స్థైర్యమునొంచెఁ గాముకుల సారసబృందము మూసెఁ గల్వలన్
ధైర్యముగొల్పెఁ దూర్పుదెసఁ దారకొని మేదినిముంచె వెన్నెలన్

చీకటులుమాసె దిక్కులు చిక్కవీఁడె
పృథివినెల్లను వెన్నెల వృద్ధినొందె;
గలువలొగివికసించెను గమలములొగిఁ
బాసెఁజెల్వము చకోరము వాసెఁ బెంటి ౪౪

అంత సంధ్యావందనకాలంబు సమీపించుటయు, నిమి
వశిష్ఠులొపగంజేరి మజ్జంబునలొనర్చి, దర్భాసనాసీనులై, స్వాంత్య

కాలకృత్యంబులుదీర్చికొని రాముఁడరణ్యమునుండి గొనివచ్చిన కందమూలంబులను భుజించి, మధుక్షీరంబులం ద్రావి సుఖాసీనులై రామునిం గూర్చి ంబిలచి, నిమి యిట్లని ప్రశ్నించె 89

ఇచటి కొంతదూరంబునం దీవుకొలఁగు
పత్తనంబుండు నందుకుఁ బ్రభువెవండు
బత్తితోడను బ్రజలెప్డుఁ బరిఢవిలుచు
మెలఁగుచుందురె వారలు మెప్పువడసి 90

దైవభక్తినిగొందురే ధరణిజనులు
ధర్మమెడబాయకుందురే ధార్మికులును
బీదసాదుల కెగ్గులు భీతివదలి
సేయరుగదా! దురాచార చింతమతులు 91

## నిమిసార్వభౌముఁడు శివునికి నాలయాదులు నిర్మించుట.

ఘోరకానన భూమిని గూడినట్టి
లింగమునకును నలుగడలం గలిగిన
కంటకావృత వృక్షముల్ కణుఁగఁదీసి
కఱకురాళ్ళను జదునుగాఁ దఱుచవలయు 92

ఈకార్యంబునకుఁ సహాయపరులై యిప్రాంత్యవాసుల్ మహాం గీకారంబున నియ్యఁగావలయు లెక్కింపంగదుఁ ద్రవ్యమా

యాకార్యంబులొనర్పఁగావలయు నాయావేళలందొప్పఁగాఁ
బ్రాకారాదులుముందుఁగావలయు సంపాదించు ద్రవ్యంబుచేన్

ఇటులఁబ్రశ్నింపగా రాముఁడిట్టులనెను
చుట్టుపల్లెల యందొట్టు పెట్టినట్టు
పెద్దనై నేనుబాలింతుఁ బ్రీతిఁదనర
వారిచేనెంత పనియైన వఱలునిందు 94

నిమిసార్వభౌముని కాగొల్లజేని వచనంబు లమృతతుల్యం బులై యొప్ప, దానుబూనిన కార్యం బనివార్యంబుగా నెరవేరం గలదని సంతసించి, ప్రొద్దుపోవుటంజేసి, యనంతరంబ వారలు నిదురించి, మఱునాఁడుదయమునఁ బ్రాతఃకాల కృత్యంబులం దీర్చికొని,

నిమిసార్వభౌముఁ డావిధిఁ
దమి హెచ్చఁగఁ బూనికతోడఁ దక్షుణమటకున్
గుమికూర్చెను వరశిల్పులఁ
గ్రమమునరావించె విశ్వకర్మను ద్రుటిలోన్. 96

తీర్పించెన్ గడుమిట్టపల్లము లటన్ దిన్నంగఁజూఁపట్టఁగా
జేర్పించెన్ బలుచోట్లనుండి తగు కాసీతాలఁబెక్కింటినిన్
గూర్పించెన్ బహుశార్శ్వకార్మికుల నాకుడ్యంబులన్ గట్టఁగా
జేర్పించెన్ శిలలెల్లగోపురశిఖల్ పెంపొందఁగా శీఘ్రతన్. 97

ప్రాకారంబులఁ గూర్చిరి
యాకాశమునంటునట్లు నతిశ్రేష్ఠముగాన్
సాకల్యంబుగ గోపుర
మాకానసమందుఁగూర్చి రతిశయభక్తిన్ 98

గోపురమునకును జుట్టును
దీపింపఁగ మంటపములఁ దీర్చిరివరుసన్
భూపులుపూనినకార్యము
లేపుగఁజరుగంగఁబడవె? యెచ్చటనైనన్. 99

బంగరుపూఁతచేఁదనరు పాళెములొప్పుగఁజేసి శేఖరం
బుందగఁగూర్చి రయ్యదియపూర్వతరంబగు శోభ పెన్గొనన్
జెంగట నాలయంబునను జేర్చిరి నందిని సొంపుమించఁగాన్
రంగుగ బెద్దకంబమును రాజిలఁజేసి రటన్ ధ్వజంబుగాన్. 100

కోవిలకు యామ్యదిశయందుఁ గూపమొకటి
విరివిగనుద్రవ్వి, యందుల వేలకోలఁది
పద్మములఁదెచ్చి నాటించెబావనముగ
నిర్మలోదక మెప్పుడు నెగడుచుండ. 101

ఇటులాభూరమణుండు దుర్వాస ఈశ్వరాలయ గోపుర, ద్వార, కవాట, మంటప, ప్రాకారాదులనిర్మించి, యీశ్వ రారాధనములు చక్కఁగజరుగునటు లాజ్ఞాపించి, దేవుని సర్వకైంకర్యా

ములకై యపరిమిత గోహిరణ్యభూమ్యగ్రహారంబు లొసంగి, తక్కంగలతీర్థంబులసేవించుటకై వశిష్ఠమానిపుంగవుండోడ్కొని,

ఘనకోదండము వామహస్తమున శృంగారంబుగాఁబట్టి, ద
క్షిణహస్తంబున నంపకోలలను నిక్షిప్తంబుగావించి చెం
తనయోగీశుఁడు సేవకాజనము వింతల్ సూపుచుండంగఁ దాఁ
జనెఁదూర్పుందెసమల్లికార్జునాగినుత్సాహంబుతోఁగాంచఁగాన్

అంత రాముండు ప్రతిదినంబు నీశ్వరసన్నిధానంబువీడక భగవద్ధ్యానపరతంత్రుండై మెలంగుచుండె.

## హేమంతర్తు వర్ణనము

భానుమరీచికాప్రభలు ప్రాభవమున్ విడనాడె; మోటలై
కాననవృక్షశాఖలను గర్కశపత్త్రము లెందుఁగన్పడెన్;
దీనముఖంబులం బసులు దిక్కులకుంజనె మేఁతకై; లస
ల్లీనములై కషాయజల లేశములై కనుపట్టెనాపగల్ 105

హిమకరుఁడంబరావని వహించి వివాదములెల్లఁదీర్చి, దా
శ్రమఁగొని, నిద్రఁగూరఁ జనుసవ్వడి నెచ్చెలికాఁడెఱింగి యా
సమయమునందటన్ మశకజాలికఁ గప్పినరీతి నాకసం
బమర, హిమంబుచేనలమి యద్దముజేయుకి నంతకంతకున్

భానునిదివంబు, రాత్రినిజాను యుగము
నాదరువుగొని, కడపిరి పేదవారు;

కంబళుల, శాలువులఁగొని కప్పికొనుచు
ధనికులెల్లరాఋతువు బాధనుదొలఁగిరి 107

రాముండాఋతుబాధ యీశ్వరునకున్
రాత్రిందివంబుల్ సదా
యేమార్గంబునఁ గష్టపెట్టునొగదా!
యిప్పట్లనంచున్ వ్యథన్
దామేనంధరియించు గొంగడిఁదగన్
స్థాణున్వడిన్ గప్పె నా
సామిన్ మించిన మంచుతాఁకు తొలఁగన్
సంతోషమొందన్ హృదిన్ 108

తనసేవారతి భంగమాయెనని తత్త్వాత్యంబునందుండు నా
ఘనసర్పంబదిత్రోసి చుట్టుకొనఁ దత్కార్యంబు గొల్లండు చ
య్యన వీక్షించుచు దేవదేవునకు నెయ్యంబైన బంటెవ్వఁడో
కనఁ దావేడెను భర్గు నాతెఱఁగు నిక్కంబెద్దియో తెల్పఁగన్

ఎన్నిదినంబు లవ్విధిని నేకమనస్సునఁ జింతసేసినన్,
బన్నగభూషణుం డెదురుపల్కఁ డిదేమని తాపమంది, యీ
యున్నికొళాయబట్టి చలినోప దటంచొకొయెల్లఁడయ్యెబో
మిన్నగునాదుచర్మమును మెచ్చఁగనిచ్చెదనంచుబూనఁగాన్

ఈశుండు పదఁపడి యిదియేమికార్యంబు
వలదటం చసిధారఁదొలఁగఁజేసి,
నీదగుభక్తిని నిజముగాఁగనుఁగొనఁ

బరికించి యివ్విధిఁబలుకఁగినాడఁ
బూర్వ జన్మంబునఁ బొడమినపుణ్యంబు
కతన నాసేవ్యంబు కడిమిఁగలిగె
నీభక్తిసేవకు నేఁజాలమెచ్చితి,
నేమైనవరముల నెలమిఁగోరు

మనఁగ గోపకుం డీశుపాదాబ్జములకు
నొరఁగి సాష్టాంగదండము లొగియొనర్చి
మోక్షసామ్రాజ్యమిమ్మని మురిసియడిగె
దేవదేవుండు దయనొసఁగి, తివిరిచనియె 111

అంత సూతుండు శౌనకాదిమహాఋషివర్యుల కనంతర కథావిశేషంబు సవిశేషంబుగా నిట్లు చెప్పందొడంగె. 112

ఎఱుకల బిడారు

భారతదేశములోని, య
వారతరంబైన వారి వాహినులందున్
నీరములినుకఁగఁ గొన్నిట
నీరసముగ ఫలితమబ్బె నిజముగ నరయన్ 113

బేహారులు పలుచోటుల
నాహారపు దినుసు లటకు ననుపుగఁ గూర్పన్
బాహాటముగను బేరం
బాహా! సేయంగఁదొడఁగి రాతఱి నచటన్ 114

ఎఱుకవారలు గొంద ఱేకైక దేశ
ధాన్య, సంబార, వాసన ద్రవ్యకముల
నపరిమితముగ గో, వృష భాశ్వఖరము
లందు నెక్కించి, బేరంబు లాడఁజనిరి. 115

ఓప కలం నెఱుకలవా రొకబిడారు
విడిసి రొకనాఁటిఱేయి నవ్విపినమందు
నచట దింపిరి వస్తువు లతిరయమునఁ
గూర్చి రావటిండ్లంతఁ గెదురుగాను. 116

గోదుమబస్తాలు కుదురుగాఁబేర్చుచు
నమరచి రొకదెస నవసరముగ
మిరియంపు గోనెల మేదిని వరుసఁగా
బెట్టిరి యొక్కెడ వేగిరముగ
నేలక, వక్కల జాలియల్ క్రమమున
నుంచిరి యొకవంక నుచితముగను
సంబారు దినుసుల సంచులు సొల్లుగా
దించిరి య్యొకచోటఁ దీరుగాను

అంతగోవృష భాశ్వములఁ లరఁగట్టి
సూకర, ఖరంబుల దగిల్చి సూత్రములక
తోలు. రొకటి గుండెన త్రాలనుంచి
యంటిలోపల ఘటంబు నెలమిఁ జేర్చి 117

ఇంధనంబుల కొఱకుఁగా నేఁగినట్టి
మగలులను బేర్కొని వడిగమఱలుఁడనుచు
నాలుఁబఱచుచుఁ బొయ్యిల నగ్గినుంచి
ధాన్యమును ఱోటఁబోసుక దంచుచుండ 118

## చంద్రోదయ వర్ణనము

విశ్వంబుఁ దనకాంతి పుంజములతో వెల్గించి సూర్యుండు, స
ప్తాశ్వంబుల్ సడలించి వీడిరథముఁ బాయంగఁ దాపంబులఁ
శశ్వత్సౌఖ్య మొసంగు నయ్యపరది క్శైలంబునంజేరి, య
ట్లైశ్వర్యంబులఁ దోగువానివలెఁ దానందొప్పె హేమాకృతిఁ

ఆశ్వాస ప్రతకంబు లందందుఁ దిరుగంగ
వానిఛాయ లవనిఁ బాదుకొనెనొ
యనఁగఁ బుడమియెల్ల నంధకారము గ్రమ్మెఁ
బాపసంగపుణ్య ఫలము కరణి 120

సందె యిరులటు లనుసంధింప నయ్యెడ
నంధకారమందు నలరుచుండు
మిణుగురుపురుగులన మినుకుచుఁజుక్కలు
గగనవీధి నపుడు గానుపించె 121

## ఎఱుకలపెద్దకు స్వప్నంబుగలుగుట

బోనములారగించి రతి భోజ్యములం గడువేడ్కతో సురా
పానములాని మత్తిలుచుఁ బండిరి; వారలమానసంబులన్

గానములందు లీనమయి కావరమెక్కి సతీపతుల్ మహా
హీనములైన భాషల నహేతువుగ న్బగఁబూని రొండురుల్

ఇటులఁ గడిందికోపమున నెక్కిన కైపులసొక్కి, సోలి సం
పెట లట ప్రోగినట్లు బహు భీతిని దోపఁగఁ గొట్టుకొంచు లం
పటములఁదేలి, పిమ్మట, తపంబుల మానముదాల్చి మానుల
ట్లటు నిటుఁ బోక గాఢమగు నారతినొందిరి నిమ్మళంబుగన్

అద్దమ తేయియందుఁ దమకంతకుఁ బెద్దడు సుప్తినుండ బల్
ముద్దులుగుల్లు మోముపయి ముంగురులాడఁగ మేలుజాళువా
ముద్దయనో యనంగ నొకముద్దియ గన్పడి సద్దులేక మీ
యొద్దనె యుంటివచ్చితిని యోజనముల్ పదునైదుదాఁటుచున్

కడపమండలమునఁ గనఁగలుగు నొక్క
పురము దువ్వూరనెడుపేరఁ బొల్పుఁగాంచి
యాపురంబును గాచుచు నందునుంటి
మీర లాత్రోవఁ దరలుట మెచ్చి మదిని 125

వచ్చుచుంటిని మీతోడి వారిఁగూడి
యిటకుఁ బ్రాగ్భాగముననున్న యిరవునందు
నీశుఁ డుండుటఁ దెలిసి నేనిందుమాళి
సేవసేయంగఁ బొడమెను జిత్తమునను 126

దుర్వారమ్ము యటంచు నేఁబఱఁగితిన్ దోర్దండశక్తిన్ సదా
యెవ్వారల్ ననునమ్మి కొల్చెదరొ నిత్యైకాగ్ర చిత్తంబుతో
నవ్వారిన్ సతతంబు గాచెదను నేనత్యంతమున్ బ్రేమతోన్
నివ్వేళన్ ననునమ్మి యాలయము నాకిచ్చోట నిర్మింపుడీ

ఇట్టులాడ శక్తి యింపగుపల్కుల
నంత నిదురనుండి యతఁడు దెలిసి
తోడివారిబిలచి తోరంపువేడ్కతో
నుడివె వానికలను నుగ్గుపోక 128

కొందఱు నమ్మిరి కథనము
కొంద ఱదియెంచ మిథ్య కూర్కొనుఁ డనఁగన్
చిందఱవందఱలయి వా
రందఱు గుమిఁగూడియుండ నాతఱి నచటన్ 129

గోదుమలన్నియు గుండ్రాలుగామాఱె
బియ్యంపుమూటలు పిండియయ్యె
మిరియంబు లన్నియుఁ గురువిందలయ్యెను
బూగీఫలంబులు బూదియయ్యె
నిష్కుటీఫలములు నింబబీజములాయె
జొన్నలు, సజ్జలు సున్నమాయె
రాగులసంచులు రజముగమాఱెను
సంబారుదినుసుల సత్తువోయె

శిశువులందఱు చిఱచిఱఁజేఁతుగొనిరి
యెద్దులావులుగుఱ్ఱంబు లేపుగొనియె
గ్రేవులు పరువసాఁగెను మేపుమాని,
మదగజంబుల సింగంబు మెదలినట్లు 130

ఇట్లామిత్తకపు నిమిత్తంబులు మొత్తంబులుగాఁ గన్పించ జిత్తరువులచందంబునఁ దమమొత్తంబు ప్రవృత్తిమాని కత్తరిల్లు గుండియలం దత్తరపడుచుండ, నాయెఱుకలఱేఁడాతఁడి వారికి ధైర్యంబుగొల్పి, మూఢులారా! నా స్వప్నంబున దర్శనంబయిన యా బిత్తరింగూర్చి యిత్తఱిఁ బ్రార్థించి మన దుర్నయమునకై మన్నింప వేఁడుదము. సామాన్యంబుగ దేవత లపచారంబుల సైరింపకపోరని యాబాలవృద్ధము తమ మనంబుల నాశక్తిమూర్తిని నిలిపికొని, యేకముఖంబుగఁ బ్రార్థింపఁ దొడంగిరి. 131

## ఎఱుకలు తమ యపరాధంబు సైరింపుమని ప్రార్థించుట

దేవీ! హైమవతీశ్వరి!
ఈవీధరఁగావనుండు టెఱుగము మదిలోఁ
వేవిధముల దృశ్యంబగు
నీవిద్యఁ దెలియ మయితిమి నిందితబుద్ధిన్ 132

లోకంబులసృష్టింపను
లోకంబులఁగావఁ ద్రుంప లోకేశ్వరివౌ

నీకారుణ్యంబునుగొన
నేకరణియొ! దెల్పు దేవి! యీశ్వరి! జననీ 133

మాభాగ్యము గూలుటకై
నీభాసురరూప మొక్క-నిక్క-ము గనమిన్
లోభమదంబులఁ గొంటిమి
నీభక్తియె శరణు మాకు నిజముగ నింకన్ 134

చేసిన యపరాధంబును
నీసైరణచేతఁగాని నెటిఁబోదుసుమీ!
దోసిలియొగ్గుచు వేఁడెడి.
నీసమితినిగాచి ప్రోవు మీశ్వరి! కరుణన్ 135

నీదగుశక్తియె మేమును
మాదారలు మాదుసుతులు మఱిమాపశువుల్
మాదగుసర్వస్వంబును
నీదనియే దలుతుమింక నిజముగ దేవీ! 136

భవ దాజ్ఞానుసరణిఁగను
నవనిధులనుదెచ్చి, యిచట నాణెంబొప్పన్
భవనంబు గూర్చువారము
భవములఁదొలగించిమమ్ము పాలింపఁగదే 137

భూమిని నిడెదము రత్నఁపు
దామంబున సింహపీఠిఁ దదనంతరమున్
నీమమెలర్పఁగఁ దెత్తుము
చేమంతుల మల్లె, మొల్లచెందొవపూలన్ 138

చీనాంబరంబు దెత్తుము
నానారత్నంబులందు నమరిన నగలన్
బోనాడక నీకిత్తుము
దీనానులము మముఁ బ్రోవఁ దిక్కెవరింకన్ 139

పామరులము దుర్మదులము
మామడియపు బుద్ధికోలఁది మతిహీనతతో
నీమాహాత్మ్యం బెఱుఁగక
యేమఱితిమి నిన్నుఁ గొల్వ నిత్తఱినిచటన్ 140

ఇటు లాప్రచ్ఛన్న స్వరూపిణింగూర్చి యాకిరాతులనేక సాష్టాంగ నమస్కారంబులు గావించి, శరణుసొచ్చిన యనంతరంబు

## దేవి యెఱుకలవారియొక్క యపచారంబు సైరించుట

దేవి ప్రహర్షచిత్తమున బ్రత్యక్షంబుగానిల్చి నా
వింతల్గంటిరె! నాదు మాయకు లిటుల్ వేధల్గడుంబొందరే?

పంతంబున్ వహియుంచి, బాధలను నాభక్తాగ్రులన్ బెట్ట, నా
వంతై నన్ వ్యథనొందఁ బోకుఁడు సునాయాసంబ నేఁ బ్రోచెదన్

నీదువస్తువు లెప్పటిమాదిరగను
ఏరుపడఁగల వలమటల్ దీరిపోవు
నాదు దర్శనమునఁ జేసి, మీదుపాప
మెల్ల నడఁగును మనుఁడు మీరుల్లమలర 143

సంతసమొందుఁ డింక ధర సద్గతిగల్గెడు మీకుఁగాన గో
రంతయువంతనొందకుఁ డయాచితభాగ్యములబ్బునెప్డు మీ
రెంతయుఁగూర్పుఁడీస్థలిని నింపగునాలయ ముందుఁజేరి నే
నింతలుగొల్చుచున్ గనులవిందొనఁగూర్చెద భక్తకోటికిన్

ఇచటి కనతిదూరంబునం దీశ్వరుండు
విడిసియున్నాఁడు దుర్వాసు వినుతినొంది
దర్శనంబును బొందుఁడు తాల్మితోడ
నంతఁబయనంబు సాగింపు డతిముదమున 145

ఇటులవచించి, యజ్జనని, యేఁగె నదృశ్యత వారలంత ము
న్నటివలెఁ జింతవాసియును బొన్నులఁగూరుకునొందరై రి యా
పటుతరకార్యభారవహబద్ధమనస్కులుగాన వెంటనే
యటకును శిల్పులన్ బిలువనంపిరి గొందఱఁ గొన్ని యూళ్లకున్

అట్టులఁ జింతిలు వారల యాత్మలలోని
చిక్కుచీఁకటులు హరియించినటుల నపు
డరుణరేఖలు గన్పట్టెఁ గరముమెఱసి
జయరవమ్ములవలెఁ బక్షిచయముగూసె 147

నిర్మించిరి యాలయమును
నిర్మాతలచేత శాస్త్రనిలయమమురీతిన్
కార్మికులు గూర్చి రందుల
భర్మంబగు వేదిక నటఁ బాటవమొప్పన్ 148

అలయమందుం జేరెను
ఆలలితమనోహరాంగి యమరినదీప్తిన్
బాలవలెను గనుపించెను
లీలలచే జనులకెల్ల లేమయనంగన్ 149

దేవిఁ బూజించి రవ్వారు దివ్యగంధ
పుష్పమాల్యాంబరాదులఁ బూర్ణభక్తి
వందనశతంబు లంతట వరుసనొసఁగి
యీశుసందర్శనంబుకై యేఁగిరపుడు 150

మూఢత్వంబును బాసి వారు బహుళామోదంబునన్ భక్తితో
గాఢంబౌ యవివేకమున్ విడచి విజ్ఞానంబుగైకొన్న సం
రూఢప్రోజ్వలయోగసిద్ధులక్రియన్ రుద్రున్ మదింగొల్చి రా
గాఢప్రజ్ఞ లనంతరంబరిగి రక్రూరంపుభావంబులన్ 151



# శ్రీ పార్వతీ విజయము

## తృ తీ యా శ్వా స ము

శ్రీలలనామణి తోడను
గేళిఁ సలుపంగ దేవగిరులఁ గనుచుఁ
నీలాలక తడవాటను
జాలినిగొనుచుండు శేషశైల నివాసా! 1

అనంతరము శౌనకాదిమహర్షులకు సూతుం డిట్లువచించె
అంతఁ గొంతకాలంబునన. 2

## రాజగండ గోపాలదేవ పరిపాలనము

హైందవ సామ్రాజ్యంబులు
గందరగోళంబుగాను । గడబిడనొందఁ
మందప్రజ్ఞుల నణఁప, న
మందాటోపంబుతోడ మాన్యుండొప్పెఁ. 3

---

నెల్లూరు తెలుఁగు చోళులు వంశావళి

ఆంధ్రుల చరిత్ర మధ్యయుగముఁ (విక్రమసింహ పురపాలకులు)

(1) పే 55_సిద్ధిరాజు నెల్లూర నెడు విక్రమసింహపురము నేలెను.

క్రీ. శ. 1189 - క్రీ. శ. 1207

చోళసామ్రాజ్యభూపాలసోముఁ డతఁడు
రాజరాజ, మహారాజ, రాజసింహ,
రంగనాథ, పొత్తపి చోళరాజ, రాజ
గండగోపాలదేవ ప్రకాండుఁ డనఁగ. 4

శత్రుభీకరుండు త్రిజగచ్చక్రవర్తి
గండగోపాలదేవుండు గడుసుమీరి
యాంధ్ర కర్ణాట, కేరళాద్యాధిపతులఁ
బీఁచమార్చుచుఁ దాఁగొనెఁ బృథ్వి నెల్ల. 5

(2) ఎఱ్ఱసిద్ధి (గండగోపాలుఁడు)

(3) నెల్లూరు తిక్క భూపతి (తిక్క తెలుఁగుచోళభూపతి) తిరుకాళుఁడు, చాళుక్యసామంతుఁడు, వీరరాజేంద్రచోడచక్రవర్తికి సామంతుఁడును పెద్దయ యాస్థానకవిగా, తిక్కనమహాకవి పెదతండ్రి సిద్ధనామాత్యుఁడు మంత్రిగాఁ గలవాఁడు. క్రీ. శ. 1216



(4) మనుమసిద్ధి (సిద్ధనామాత్యుని సుతుఁడు ఖడ్గతిక్కన సేనానాయకుఁడు)
క్రీ. శ. 1210 - 1245

కోవూరు బ్రాహ్మణులకు దానము 1257

మనుమసిద్ధిరాజు జీవద్దశాంతము 1260

(5) పే 87 శ్రీ మహామండలేశ్వర నాగదేవమహారాజు క్రీ శ. 1275

(6) మనుమసిద్ధిరాజునకు బిదప సిద్ధిరాజు కొడుకగు రెండవ తిక్కరాజు ఇతనికే యిమ్మడి తిక్కరాజు 1278

(7) ఇతని వెనుక మనుమగండగోపాలుఁడు 1282 - 83

(8) పే 108 మనుమగండగోపాలునికి వెనుక విక్రమసింహ పురాధిపత్యమును వహించినవాఁడు మధురాంతక పొత్తపి, చోళ శ్రీ రంగనాథుఁడు. ఇతనినే రాజగండ గోపాలదేవుఁ డందురు. 1289 - 90 - 1314

పే 50 (ఈ చోడభూమీశుఁడు మధురాపట్టణమును జయించుట, ఆంధ్రదేశమునఁ బొత్తపియను పట్టణమును నిర్మించుటచే నీతని కీమధురాంతక పొత్తపి చోడ నామమొసవినది)

పే 108 ఇతని కాలమునఁ గాంచీపురచోడులయొక్క యధికారము సంపూర్ణముగ నంతరించిపోయినందున నీతఁడు త్రిభువనచక్రవర్తియను బిరుదమును వహించెను. ఇతనిశాసనములు గూడూరు నెల్లూరు సీమలలోఁ గానుపించుచున్నవి. ఇతఁడు క్రీస్తుశకము 1289 - 90 సంవత్సరమున నెల్లూరుసింహాసన మెక్కినటుల శాసనములలో నుదహరింపబడిన పరిపాలన సంవత్సరములఁబట్టి యూహింపఁదగియున్నది.

పే 108 - 109 కాంచీపురప్రభోళులు యధికారమంతరించిన వెనుక నితఁడు స్వతంత్రుఁడై కాకతీయ రుద్రమదేవికిని గొంత కాలము కాకతీయ ప్రతాపరుద్ర దేవ చక్రవర్తికిని బ్రత్యర్థిగనుండి క్రీ శ. 1314 సంవత్సరము వఱకుఁ బరిపాలనము చేసి, తుదకుఁ బ్రతాపరుద్రునిచే జయింపబడి, రాజ్యము గోలుపోయినటులఁ

గనఁబడుచున్నది. ఇతనికిఁ బిమ్మటఁ గాంచీపురముపఱను యాదవదేశమును బ్రతాపరుద్రుని సైన్యాధిపతియగు ముప్పడినాయకుఁడిచే జయింపఁబడి కాకతీయసామ్రాజ్యమున జేర్పఁబడినది. ఇతనితో విక్రమసింహపుర చోడులచరిత్ర మంతరించినది.

(9) ముప్పడినాయకుఁడు కేరళదేశాధిపతి రవివర్మాకులను జయించి 1319 సం|| జూన్ తే 11 ది మానవీరుని తెలుఁగుచోడుని సింహాసనమెక్కించెను. తే 16 ది కాంచీపురములో అరుణాలపెరుమాళ్ళ దేవాలయములో శాసనము వ్రాయించెను.

శ్రీ రాజగండగోపాలదేవునిచే విజయవర్షమున వ్రాయింపఁబడిన దుర్వాస ఈశ్వరాలయగోపుర ద్వారపార్శ్వ శిలాశాసన బహిర్గతమునకై గ్రంథ కర్తచేఁ గావింపఁబడిన చర్య:

—:(0):—

Correspandence Refernce I

**To, The Director of Archaiolological Department, Madras.**

Sir,

Two Monumental stones were found in Sri Koteeswaraswami temple at Duvvur; one at the entrance wall laid on the left side of the front door and other in the temple compound wall of the temple. The ancient language written on them which could not be read over and the gist of it understood. the Temple is an ancient one in which the God was installed by the great rishi Durvasa

I am trying to write a history about the temple and its subsequent improvements in poems in Telugu language. I have so for writtem nearly three aswasams confaining nearly 300 poems, quoting some anthorites,

If you are kind enough take a copy of the inscriptions on these stones and enlighten me, it will be helpful to complete the book with full authority

Duvvur
12-12-40

I beg to remain
Sir
Yours most obediently
D. Basvi Naidu.

Reply for refernce I

No. 106/1846-10

Mylapore, Madras.
4th January 1941.

From, Rao Bahadur C. R. Krishnama Charlu Avl
B. A.,
Superintendent for Ephigraphy

To, Sri Vidvan, Duvvur Basvi Naidu,
Duvvur Post, Nellore District

Sir, Ref your letter dated 12-12-1940, the temple will be visited and examined by the Department presently and the information asked for by you supplied some time in April 1941.

(Sd) G. V. Sreenivasa Rao
for superintendent
for Ephigraphy

## Reference II

Duvvur - Nellore Dt.,
9—9—43

To M. R. Ry

Sri Rao Bahadur C. R. Krishnama Charlugaru B. A.
Government ephigraphist for India.

Sir, Your honour visited Sri Duvvur Koteeswara swami temple on 5 th March 1943, and kindly taken the copies of the monuments, I was told in person that I would receive one of the fair copies and its translation into Telugu within two or three months.

Yet I have not received the copies of them. I am very anxious receive them in a short period.

Please kindly despatch them soon so as to finish my aim.

I beg to remain
Sir
Yours most obediently
D. Basvi Naidu.

Returned

One inscription of Duvvur recorded in Betterworth and Venugopala Chettis, Nellore inseriptions. Part II Page 772 is a fragment. The begining is in Sanskrit and mentions Rajagonda Gopal. It says in the following tamil portion that some gift was made to last as long as the sun and moon last

It is dated in the year Vikrama and mentions Vikrama Sihmapura (ie) Nellore. The other inscription is completly damaged. It is also in Tamil.

(Sd) C. R. K. Charlu 19-9-43

Govt Ephigraphist (on leave)
Stone inscriptions. Nellore 12

(Duvvur Sanskrit in Grantha charecters and Tamli from gopuram of Duvvur Koteeswara Temple)

This is a fragment. The begining is in Sanskrit and mentions Raja Ganda Gopala. In the Tamil portion the cycle year Vijaya and Village of Pakkama on the Northern bank are mentioned; it says that some gifts were made with lideal of water to last as long as the moon and sun endure.

—o—

ద్రావిడభాషా శాసనాంధ్రీకరణము

1 ............
2 మహారాజగండగోపాలహా, విక్రమసింహ పురేంద్రహా, విక్రమ విక్రివేనసు.........
3 మైచిత్రం ప్రుష్కలవివత్స.........కర్మ్రనవ్వస కమలం ........సమ్మి
4 పెన్నానదికి నుత్తరములో.........
5 డయిన విజయసంవత్సరత్ ...
6 నమాహాపదకంజలాణి - సూర్య చంద్రాదులుండునట్లుకు.

పదమూఁడవశతాబ్ద పాదచతుర్థిలో
* విజయవత్సరమున వినుతికెక్క
నాంధ్రదేశమునందు నతులకీర్తినిగన్న
సింహపురమ్మును జేరియతఁడు
ఆపురపాలుని ననిలోనఁ దగఁగూల్చి
దాఁగొనెఁ బురమును దక్షిణంబ
దేశపాలకు లోడి తేఁకువనొందుచు
వినతశిరస్కులై వేడికొలువ

భండనమున విలయకాలభైరవుఁడన
నరిబలంబుల వక్షము లవిసిపోవ
దీ యశశ్చంద్రికల్ దశదిశలు పరవ
సింహపురమును బాలించె సింహబలుఁడు. 6

అరిరాజుల్ మకుటంబు లాతని పదాబ్జాక్రాంతితో మ్రొక్కుచున్
బరివేష్టింప, నఖండ భారతధరాభారంబునుందాల్చి, బాఁ
గరి యూథంబుల సైనికావళుల దుగ్ధస్రావిన సంపూర్ణ స
ద్వర గోసంఘము, లశ్వజాలములు సంవర్ధిల్లఁ జేసెం గడున్ 7

రాజాటోపము మించి సర్వసచివుల్ రక్తిం బ్రబోధింప నా
యాజాతీయులు వారిధర్మములు నాయంబొప్ప వర్తింప నా

---

* క్రీ. శ. 1293 సం॥ ఏప్రిలు నెల మొదలు 1294 సం॥ మార్చి వఱకు విజయ సంవత్సరము.

నాజాతీయ సమన్వయంబు గడువిన్నాణంబుతోఁ గూర్చి యా
భ్రాజిష్ణుండు వెలింగె నచ్చటను భాస్వత్కీర్తినిం బొందుచున్

ద్రావిడభాషయందు సముదంచితవిద్య గడించి, యన్యభా
షావిషయంబులందు నతిసాదరభావముసూపి, విద్యలన్
గోవిదులైనవారిఁగని గోర్కెలదీరిచి యొద్దఁజేర్చి స
ద్భావముతోడ గ్రంథములఁదక్షణమే రచియింప వేడెడిన్ 9

ధీ చాతుర్యుఁడు, భూవిభుండు విధిగా దేవార్చనల్ సల్పు, ని
త్యాచారవ్రతనిష్ఠశిష్టజన వేదాఖ్యానమాలించు, స
ద్వాచాలశ్రీప్రతిభాతిరేకమున విద్వత్ప్రీతిమింజూపు, ను
ర్వ్యాచారిత్రములన్ గ్రహించి ఖలులన్ వీక్షించి శిక్షించెడున్

భూసురవరులకు భూరిదానములిచ్చి
పోషించు వారలఁ బూజచేసి
యజ్ఞ యాగాదుల ననవరతమును సల్పి
యష్టదిక్పాలుర నరిదిగొల్చిఁ
బుణ్యస్థలమ్ములఁ బూనికతోఁజొచ్చి
పూర్ణవైరాగ్యంబుఁ బొసఁగఁబూను
దేవాలయములకు దీక్షతోనరుదెంచి
దేవతార్చనములఁ దివిరిసల్పు
గోపురాదుల నిర్మించు గోమరుమిగులఁ
జుట్టుప్రాకారములఁగూర్చు సొంపుదనరఁ

పుష్పవనముల నిర్మించు బూజకోటకు
గూపములనుద్ధరింపించును గొన్నిచోట్ల. 11

ధార్మికుఁడైన యానృపతి దానశతంబుల యాచకాళికిన్
నిర్మలచిత్తుఁడై యెపుడు నేర్పు మెయిన్ గడునిచ్చుచుండఁగాఁ
గర్మనిబద్ధమానసులు కాఱియపెట్టెడి చిత్తవృత్తితో
నర్మిలిఁజేరిమూఁగుదురు నమ్మినబంటులరీతిఁ గొల్చుచున్ 12

పదఁపడి యావిభుండు నిజపాలనభూముల కేఁగుదెంచి, యం
దొదవిన కౌతుకంబున మహోజ్వలతేజ విరాజ దేవతా
సదనములెల్లఁ గాంచుచునసంఖ్యముగా నిడె భూరిదానముల్
మదికి నిరంతరావహము మాన్యులుపూనినకార్యవర్గముల్

## గండగోపాలదేవుఁడు సింహపురిదేవాలయోద్ధరణము గావించుట

శ్రీరంగనాథునిసేవించి యొసఁగె భూ
మ్యగ్రహారముల సమగ్రముగను
గోపుర ప్రాకారకోటి నమర్చెను
ముఖమండపములను బ్రోలఁ దనిపె
గర్భాలయమునకుఁ గనకంబు తొడిపించె
1 రత్నాలు కూర్చెను రాజిలంగ

వాహానంబులు గొన్ని వరుసగా నిర్మించె
రథముల జేయించె ర క్తితోడ

స్వామికైంకర్యములు నెప్డు జఱుపుచుండు
భక్తితోడను దేవుని బ్రస్తుతించు
నన్నదానంబు సేయుc బ్రసన్నుcడగుచు
సాధుజనములc బోషించు సంతతంబు. 14

సింహాపురంబు చెంతలను జెంతల నుండెడి సర్వదేవతా
సంహతి నెల్లcజేరి బహుసన్నుతులన్ మదిసల్పి, భక్తిచే
♦ సంహతలంబు ఫాలమున సంధిలజాగిలి మ్రొక్కి వేడ్కనా
సింహపరాక్రముండొనcగె సీమల పల్లెల నేల లెంతయున్ 15

ఇట్లు లీతcడోర్మి నెల్లచోటుల కేcగి
పుణ్యతీర్థములను బొసcగc గనుచు
సర్వదేవతలను పరగcబూజించుచు
ధరను గాంచెc గీర్తి ధార్మికుcడన. 16

## గండగోపాలభూపతి దుర్వాస ఈశ్వరుని దర్శింపబోవుట

ఒకనాcడానృపుc డేcగుదేరెc దన జాయోపేతుcడై యిభ్భువిన్
సకలంబున్ గననిచ్ఛతోడ నటకున్ సామీప్యమందున్న, యా

మ్రొక్కుటకువ్రేళ్లు చాచిన చేయి

యకలంకేశ్వరు, నీశ్వరుఁ, శివుని, నార్యామానసోల్లాసకం
దుకమున్, యోగిజనాశ్రయున్, వరదునిన్, దుర్వాసఈశున్ గనన్

దుర్వాసపురికిని దోతెంచెఁ బురినుండి
చేరె నందలి నదీసికతమునకు
సికతామయంబైన శివలింగమునుగాంచె
శివునిబూజించెదు శేషుఁగనియె
శేషునినెలవైన చిఱుకోనఁ బరికించెఁ
గోనలో ఋషులను గూర్మిఁజూచె
ఋష్యుపదేశంబు కృత్తివాసునిఁ దెల్పెఁ
గృత్తివాసునిపూజ బత్తిసలిపెఁ

పూజచేఁగనియెను బుడమిని వేడ్కతోఁ
పార్వతీశుకరుణ భాగ్యగరిమ
కరుణ భాగ్యఫలము గన్పించెఁ దనకును
విమలకీర్తి, ముక్తి విశ్వమందు 18

శిలయు, గోపురాశ్రితజనాలయ మండప, యజ్ఞశాల, గో
శాల, విలాసమందిర, పశాల సముజ్వలశేఖరాదులన్
నీలపురాంతరో వచట నిర్మితిఁజేయ, ధనంబొసంగె నా
కాలమునందుఁ జేర్వడిన కార్మికులెల్ల గడించి గావనుల్ 19

స్వామిసదనంబునకుఁ బూర్వపార్శ్వమందు
డిగ్గియనొకటిఁ ద్రవ్వించె నిగ్గుదీసి
ఆలవరుసలఁ బేర్పించె సాలుఁగొప్ప
నందుఁ బెంపొందఁగాఁజేసె నంబుజముల 2

నిర్జనభూమి యదొంటను
దుర్జనులగు తస్కరాది దుర్మార్గు లెటన్
దర్జనములు సేయుటఁగని
వర్జింపఁగ వారిపనుల వడిశాసించెన్ 21

సుగుణులగువారు గృహములఁ
దగినటులంగట్టికొనిరి; ధర్మమున విభుల్
మగటిమిఁ బరిపాలింపఁగ
వగపేటికి నొదవు పురనివాసుల కెందున్ 22

సుందరమైన యాపురము సొంపలరారుచుఁ జిత్రమొప్పె శ్రీ
చందన, నారికేళ, వట, చంపక, కాంచన వృక్షరాజ మా
నందముగొల్పుచుండె సదనంబులు జృంభణమొంద, మేసవుల్
సందుల గొందులంబడుచు సాగుచునుండెను బట్టణంబునన్

సర్వదినంబులన్ వెలయు సంతత కార్యములెల్లఁజేయఁగా
పర్వదినంబులన్ శివుని బార్వతిఁ బూజలఁ భక్తినల్పఁగా

నుర్వినిగొంత దానమిడె నూర్జితధర్మపరైక బుద్ధితో
నిర్వహణాధికారి నొకనేర్పరి నచ్చటఁ గూర్చె వెండియున్ 24

* దానశాసన మొకటిఁ బ్రధానమైన
ద్వార పార్శ్వస్థగిత శిలాతలమునందు
ద్రవిడలిపిలోన వ్రాయించె దానచయము
చంద్రసూర్యులకాలంబు జఱుగునటుల. 25

అంతఁబృథ్వీశుఁడరిగె గ్రామాంతరంబు
నాత్మసుత, సతీ, బంధుజనాళిఁగూడి
మంత్రి, పరివార, పరిచరమండలిఁగొని
జయరవోపేత మంగళ స్తవము లొలుక. 26

అనంతరము సూతుండు శౌనకాది ఋషిశ్రేష్ఠులకుఁ దన రచనాంతర కథావిశేషంబుల నిట్లుచెప్పందొడంగె:- అంతఁ గొంత కాలంబు సనఁగ దుర్వాసపురమునఁ గర్షకుండొకండు క్షత్రియ సంజాతుండుండె. 27

క్షత్రియవంశజాతులును సాత్త్వికధర్మమునొంది యెంతయుఁ
జిత్రముఁగా వసుంధరనుజేసిరి కర్షకవృత్తి నట్టులే
క్షత్రియవంశజాతుఁడగు కర్షకుఁడొక్కండు రామలింగుఁడీ
ధాత్రిని దేఁడటంచు కులధర్మముచొప్పుననొప్పెఁ బాత్రతన్

* వెనుక 78 వ పేజీలో చూడుము.

శైవభక్తుండై యాతండు శైశవమునె
శివుని భక్తిని నెప్పుడు సేవచేసె
సాధులను గడుబోషించె సత్త్వబుద్ధి
యోగులను జేరిసాధించె యోగమహిమ. 29

ఆతనికి గోవులభివృద్ధినంది యవియు
వేన వేలుగనుండెను విరివియగుచు
వానిసంతతిఁ గోడెలు వర్ధిలంగఁ
గృషికి నాయెడ్లు తోడ్పడెఁ గినుకలేక. 30

పండించున్ బహుధాన్యముల్ వసుధ నేపారంగఁ గష్టించున్
నిండారంగనుబోసియుంచును సదానిర్ణీతమౌ తావులన్
వండించున్ బలుభంగులన్ మఱియుఁదా వడ్డించుఁగూలీలకున్
జెండాడున్ గఠినాత్ములన్, దయనిడున్ జేసాచిభిక్షాళికిన్

నెయ్యురకొలుకునై నిర్మించెసౌధంబు
దర్బారుకై గూర్చెఁదగిన గృహము
నందంబుగాగట్టె నవరోధభవనంబు
మొగసాలనిల్పెను ముంగిటమర
సౌధోపరినిజేర్చె సౌజన్యమగునిల్లు
విశ్రాంతికై కట్టె వేదికలను
స్నానంబునకుఁగూర్చెఁ జక్కని హర్మ్యంబు
పదఁపడిరచియించెఁ బాకశాల.

నాన్యములుపోయుటకుఁగట్టె ధాన్యశాల
నశ్వములకందునొనఁగూర్చె నశ్వశాల
నెడ్లకాపులకొనరించె దొడ్లుకొన్ని
శకటము లమర్చుటకుఁగట్టె సాలనొకటి. 32

ఊరికిఁబెద్దయయ్యును నయోన్నతిఁగాంచుటచే ధృతిన్ సదా
చారముచే, విదగ్ధత విచారణ సేయుటచేత నేరముల్,
సారతరంబుగాఁ బ్రతిభ సాఁగెను దిక్కులఁబిక్కటిల్లఁగ
బేరువహించరే? భువినిఁ బేదల సాదలఁ బ్రోచువారెటన్. 33

రామభూవరుకూఁతురు రాధయనెడి
కన్యకామణి యొకయూరఁ గలదుగనఁగ
నామె యౌవనమందంగ నతివతండ్రి
వరునికొఱకును బలుచోట్ల నరయుచుండె. 34

అన్నెరివేణి కేశముల యందము తేంటులకీవినొంచు మై
వన్నెపసిండిచాయ నతివక్రతఁగొల్పును, సోగకండ్లొగిన్.
మిన్నయమీలకన్న, చనుమిట్టలు బంగరుగిండ్ల మించెడిన్
నెన్నుదురొప్పు నద్దముల నెన్నదొమెంతయు మిథ్యయేఁగనన్.

ఆనారీమణి భర్తగాఁ బడయునే నారావులింగున్, ధరన్
దానాకన్యకు నీడుగాన దలఁపుల్ దథ్యంబులై హెచ్చె, న

ద్దానిఁగాంచి వివాహముంజఱుపఁగా దాంపత్యమొప్పారె, న
ట్లా నాళీకభవుండు దొల్లిఁటిని వ్రాయంద్రోయఁగా నెట్లగుఁ

పెద్దకాల మన్యోన్యమౌ ప్రేమగడుప
నొదవె సంతాప మాత్మజులొదవమికి
దేవతాభక్తిని బడయు దీక్షగొనుచు
నీశుఁగూర్చి, వ్రతంబులు నెఱపిరెపుడు. 37

వారిభక్తికిఁ దగమెచ్చి, వాంఛదీర్ప
స్వప్నమున దేవి రాధకొసంగె ఫలము
నంతమేల్కని సంతస స్వాంతయగుచు
రాధ గర్భంబుదాల్చెను రయముగాను. 38

## సతీ పార్వతీ జననము

ఒక్కదినంబునఁ గాంచెను
దిక్కులఁ బ్రభవిల్లు దేహదీప్తులతోడన్
జక్కని పుత్రిక, నద్దియు
నిక్కముగా గిరిజఁబోలి నెగడుచునుండెన్ 39

సూతికాగృహమును సుందరమౌ శిశు
వదనచంద్రకాంతి వన్నెఁదెచ్చెఁ

దైలరహిత దీప జాలంబు వోలుచు
బాలకిడిరి పేరు పార్వతియన 40

పంచవత్సరప్రాయమై బాలదనర
నొక్కదివసంబునం దామె యోగ్యుఁడైన
సకలశాస్త్ర పురాణ విశారదాఢ్యు
చేత నక్షరాభ్యాసంబు సేయఁబడియె. 41

ద్వాదశవర్షముల్ ముగియఁ దాగడియించెను సర్వవిద్యల
త్యాదరమొప్పఁ దల్లికిని దండ్రికి, నంతటనామె యింటిగాఁ
బోఁదగదంచు నింట నొకబోధకుచే సకలార్థ తత్త్వముల్
సాదరమొందఁదెల్పఁబడ శాస్త్రములెల్లఁ బఠించె శ్రద్ధతోఁ

పదియునాలుగువర్షముల్ పడయగానె
పడుచుకును మేనిచాయలు పసిడిఁద్రోసి,
మించిపసుపును, దొలకరి మెఱుపుఁదీఁగఁ
దీటుగొల్పుచు, నమరెను దేజమొసఁగ 43

కన్య వేణ్యాళులఁ, గడుజీఁకటులఁ, గారు
మబ్బులను వర్ణసామ్యంబు నబ్బుగాని,
కాంతియందలి పోలికఁగనవు, కనితె
నెమలియీఁకల తళతళల్ నెగడుచుంట. 44

అప్పటికాలమందుఁ గురు లందెల నంటుచునున్నఁ గంటి కిం
పొప్పుచునుండె గొప్పిదుట నొప్పకయుండెను గన్నెకట్టుఁ, దా
నొప్పె జడన్విడంగ నదియొప్పెను శోభను సాజమాటచే
నిప్పటివారిరీతిఁ దుదనేమియుఁగట్టక, యూరకుండినన్. 45

మొకమున వ్రాలుచున్ మడగు ముంగురులొక్కెడవీడి యంతకా
యొకిగఁ దమంతనేముడుచు టింపునుగానఁగ భృంగపంక్తితో
నొకతఱి మైత్రినొంది యవి యొప్పుగనేర్చినవిద్యచేత నా
చికురము లిట్టికేళిఁ దగజెల్గుచునున్నవొ? యంచుఁదోఁచెడిన్

హారునిశోపాగ్నిఁ బొగసూరి మరునిచాప
మసితకేసర పరివేష మైననాఁడు
కన్నె కనుబొమసాటినిఁ గనుసుగాని
త్రిజగముల నెయ్యదియును దీటుగొనదు. 47

దళదిందీవరముల్ చకోరముల సంతానంబునుం దల్చి, యు
జ్జ్వలరక్తింగల మీలసంచలము సంసక్తంబుగాపించి, యీ
జలజాక్షీనయనంబులన్ నలువయాశ్చర్యంబుగాఁజేసె, నే
చలమున్ బూనియొ నిర్జరన్ భువిని నిచ్చాయన్ సృజించెన్ గదా!

బింబికాఫలము నధరబింబమొనరు;
దాడిమఫలబీజములను దంతచయము

వోలు; పూర్ణచంద్రకళలఁబోలు మొగము;
తమ్మిపూఁదేనియలఁబోలు కొమ్మమోవి 49

చెక్కులు లతియున్నతములై చిగురువోలు
చంద్రికలఁబోలు చిఱునవ్వుచక్కదనము
కంబుసౌందర్యమునుబోలు గళముసూడ
నంబుజంబునుబోలు ముఖాంబుజంబు. 50

బిసరుహాసన బాహువుల్ బిసరుతూండ్లు
బిసరుహస్తాంగుళంబులు కిసలయములు
కిసలయాంగుళీనఖములు కీటమణులు
కీటమణినేత్రవచనముల్ కీర్తితములు. 51

కరికుంభంబుల గౌరవాధికము బంగారంపుగిండ్లందొరన్
ధర మాలూరఫలంబువట్టువలొగిన్ దాడింబలంబొందినన్
వర జంబీరఫలంబు కోమలరుచుల్ పరిఢ్లఁగాజక్కవన్
గరమొప్పన్ గనసాటియౌ నవియు శృంగారంబుతాచన్నవన్

నాతికి మధ్యముగనఁగొనఁ
జేతిని విధుఁడటనుబట్టి, చెతీసగమిది యం
చాతడు కొనుచు గుఱుతిడ,
నాతఱి నంగుళుల రేఖ లమరెను వళులై 53

కన్య నతనాభి డిగ్గియకరణిఁబోలి
వలుదచనుదోయి గిరిసానువులఁగఁదోచి
మారమదవారణమునకుఁ గోరికలరఁ
గ్రీడలనుబొంద నయ్యవి వీథులయ్యె 54

కటితటీసమృద్ధి చక్రంబుకంటెమించె
నూరుకాండంబులకుసాటియొప్పు హస్తి
హస్తములును రంభలునుదోడ్డై నయపుడు
జంఘలానుపూర్వ్యంబులై సమతనొందె 55

పల్లవంబులవలెనున్న పాదయుగము
పవడములు సజ్జములభాతి భ్రాంతిఁగొల్పె
కడియముల, గజ్జగొలుసులఁ గలిగినట్టి
కరిసిఁబోల్చు నీకలకంఠి గమనమెన్న 56

కాంతధరియించె నవరత్నఖచితములగు
నాభరణములు పెక్కుగ నధికమేమి!
సహజసౌందర్య లావణ్య సంపదలకు
సాటిగాదుగ! భూషణసముదయంబు 57

సంతతముగా ధరించు బహుసారతరంబగు హేమదీప్తియుం
తంతదొరంగుజీర, లవియంచులు పాదములంటునట్లు మే

నంతయుఁ గప్పుచున్, ఘన కుచాగ్ర సమున్నతమందుమాత్రమా
వంతయె యావరించు నట నంతకునంతకు వింతఁగొందుటన్

కంచుకంబును ధరియించుఁ గమలనేత్ర
బాహుమూలల వక్షంబుపటిమ గొంత
గనఁగఁ గనరాక తోఁచెడు కరణియొప్ప
వింత యేమిటి? యిప్పటివిధము గాదె! 59

చందనగంధి ఫాలమునఁ జక్కనికస్తురిబొట్టుదిద్దఁగాఁ
జందన, పుష్పపంక, ఘనసార విలేపనమందుచుండఁగా
నందములగాదుగా వనితకందు సువాసన లామెమోము ద
ప్పింప దోలకించుతావి యటమేకొని దిక్కులనిండియుండఁగన్

కాంతసౌందర్యమహిమను గాంచ మనుజ
కాంత కాదామె, పన్నగకాంత కాను,
కాదు, సురకాంత యే? దేహకాంతివలనఁ
గన్నియ, యనిమిషాస్వేద గాత్రయగుచో. 61

ఇటులాగిరిజా ప్రసాదలబ్ధయగు, నాయవనతాంగి తారు
ణ్యాతిశయమున రతీదేవినిమఱపించునదియుంబోలి, సకలశాస్త్ర
పరిష్యందనసారంబైన భగవద్భక్తిసారంబు రుచిగనినదై యజ
స్రంబు గౌరీవ్రతాసక్తయై, తద్విధి సకలకర్మంబుల నాచరించుచు,

నిత్యంబు నయ్యూరనున్న శ్రీమర్వాస ఈశ్వరసందర్శనంబు గావించుకొనుచు, బూజలుసేయుచు, బేదసాదలనాదరించి వారల కన్నవస్త్రాదులు ప్రియంబుననొసంగుచు సద్గోష్ఠినుండ నొక్క నాఁడు. 62

## యవననాయక చారిత్రము

* హైందవజాతిశీలములఁ నగ్గినిఁద్రోయుచు నిందసేయుచుఁ
సందడిఁగొల్పి, పణ్య, పుర, సంత, ధనాలయ, దుర్గ, పట్టణా♦
ళింద, నికేతనాదుల † నిలింపులగూడి ధనంబుదోచుచుఁ
గొంద ఱిటుల్ మహాయవనకుంజరు లుండిరి ధాత్రిఁగ్రమ్ముచున్

♦ అళిందము=తలవాకిలి ప్రక్కనున్న చిన్నగది † నిలింపులు=బోయవాండ్రు.

* ఆంధ్రదేశము పరిపాలించిన విజయనగరసామ్రాజ్యము క్రీ. శ. 1620 సంవత్సరముతో నశించినది 1600 వఱకు నొక గోలకొండ రాజ్యముతప్పఁ దక్కిన రాజ్యము హిందువుల పరిపాలనలో నుండినది క్రీ. శ. 1600 తరువాత 150 ఏండ్లవఱకుఁ దురకలదాడులెక్కువై కర్నూలు, కడప, గుంటూరు మండలములకు నవాబులేర్పడి యుత్తర సర్కారువారి వశమైనది వారి దుష్పరిపాలన మొకదిక్కు సాగుచుండఁగా మఱియొకదిక్కునఁ బిండారీలు, దోపుడు గాండ్లు, తురకలదండులు ఎక్కువై జనుల హింసించి, చంపి, దోచి, చెఱచి, గుళ్లనుగూలద్రోచి, నానా ఘోరములుచేయుఁగా నాంధ్రులు హాహాకారములు నేసి, చాలబాధపడిరి. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర పేజి 387)

